**SIVARPANAM**
Compilation of research articles on saivism in Telugu country -
Author **N.S. Sundareswara Rao**, Vidwan, B.O.L. M.A.

First edition : October 1995.



**Rs. : 40/-**

Cover Design : Hari Sankar

For Copies:
N.S.S. Rao
1-4-19/1, Road No. 7,
Habsiguda,
Hyderabad - 7.

Composed By:
Fontline Graphics
Baghlingampally
Hyderabad - 44
Phone: 660000

Printed By:
Kala Jyothi Process Pvt. Ltd.,
RTC X Roads, Hyderabad.
Phones: 7612436, 7612337

---

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ప్రచురితం.



మాతామహుగారు

# పండిత నిడదవోలు సుందరం పంతులు

**జననం : 5-5-1865 — నిర్యాణం : 7-12-1931**

# సుందరం పంతులు, నిడదవోలు

జ. 5.5.1865 - మ. 7.1.1931. విజయనగరం; త. పార్వతమ్మ, వెంకటరామయ్య; ర: సర్వేశ్వర సహస్రము (ప. 1925); శివకవులు (శతకం); సత్యవ్రతి శతకము; హరహర శంభో శివశతకము; సింహాచల విహార శతకము; విశ్వనాథ ప్రభూత్రిశతి మొ॥ విద్వత్కవి. పురాతన గ్రంథసేకర్త. పరిశోధకులు. గ్రంథాలయ స్థాపకులు. అనేక పురాతన గ్రంథాలు శోధించి మంజువాణి మొ॥ పత్రికలకు అందించేవారు. ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి వీరు పితామహులుగా ప్రతీతి, ప్రథమంగా విజయనగరంలో 'ఆంధ్రపుస్తక భాండాగారం' (1894) స్థాపించారు. ఇది తెలుగుదేశంలో స్థాపితమైన మొదటి గ్రంథాలయంగా ప్రసిద్ధి కెక్కింది. వీరు గురజాడ శ్రీరామమూర్తిగారితో కలిసి 'కవికావ్య ప్రశంసా చంద్రిక' అనే గ్రంథం రాసినట్లు తెలుస్తున్నది. దీనిలో 1893 వరకు ఉన్న నాలుగు వందలు మంది కవులను గురించి వారి గ్రంథాలను గురించి సమాచారం పొందుపరచారట. ఈ గ్రంథం ప్రస్తుతం అలభ్యం. 'సర్వేశ్వర సహస్రం' కథాత్మక శతకం. దీనిలో పార్వతీ పరిణయం. హాలాస్య క్షేత్ర మహాత్మ్యం వంటి శివభక్తి ప్రధానమైన గాథ లున్నాయి. 'శివకవులు' కందపద్యాలలో ఉంది. దీనిలో శివకవుల రచనలు, వాటి ప్రాశస్త్యం, వారి భక్తి పారమ్యాలు వివరించారు. సత్యవ్రతిశతకము సమస్యాపూరణ శతకం. విజయనగర సంస్థానాధిపతియైన ఆనందగజపతి ఇచ్చిన సమస్యకు పూరణంగా దీనిని రాశారు. దీనిని 1900లో 'వాగ్వల్లి' పత్రికలో ప్రచురించారు. హరహరశంభో శివశతకం, సింహాచల శిహారశతకం ఏకప్రాస శతకాలు. ప్రసిద్ధ సాహిత్యవిమర్శకులు, కవులు, ఆచార్యులు నిడదవోలు వేంకటరావుగారు వీరి కుమారులు

తెలుగు సాహిత్యకోశం - తెలుగు అకాడమీ ప్రచురణ.



మాతండ్రిగారు

కళాప్రపూర్ణ

## నిడదవోలు వేంకటరావుగారు

జననం : 7-1-1903 - నిర్యాణం : 15-10-1982

తల్లిదండ్రులు జోగమ్మ, సుందరంపంతులు. పలకపట్టింది - పట్టభద్రు లయిందీ విజయనగరంలోనే. 1925లో బి.ఏ. లో ఉత్తీర్ణు లవగానే 26లో ఆనాటి ఇంపీరియల్ బ్యాంకులో గుమాస్తాగిరి. 1940లో పిఠాపురం రాజా రావువెంకటమహీపతిసూర్యారావుబహద్దూరు ఆదరణ. 1941లోమద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు ఎం.ఏ. బంగారు పతకగ్రహీత. 1941-42 సూర్యరాయాంధ్ర నిఘంటువులో పండితపదవి. 1942-43లో కాకినాడ పి.ఆర్. కాలేజిలో తెలుగు ట్యూటర్. 1944-49 మద్రాసు విశ్వవిద్యాలయం జూనియర్ తెలుగు లెక్చరర్. 4-4-49లో భార్యా వియోగం. 1948-49 తెలుగు భాషాసమితి బహుమతి. 49-57 సీనియర్ లెక్చరర్. 57-64 రీడర్ - తెలుగుశాఖాధిపత్యం. 1964లో పదవీ విరమణ. 1964-68 ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో యు.జి.సి. పథకం కింద ప్రొఫెసర్. 1970 ఆంధ్రవిశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ బిరుదు సత్కారం. 1974 సాహిత్య అకాడమీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చెరి 100/- నెలసరి ఆర్థిక సహాయం. 1976లో సాహిత్యఅకాడమీ విశిష్టసభ్యత్వం. 1982 ఫిబ్రవరి నుండి నెలకు 500 లకు ప్రభుత్వ ఆర్థికసహాయం పెంపు. 15-10-82 అర్ధరాత్రి 12 గం.లకు నిర్యాణం.

వీరి తెనుగుకవులచరిత్ర, దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము, ద్రావిడభాషాసామ్య నిఘంటువు. మద్రాసు విశ్వవిద్యాలయం ప్రకటించింది. ఉదాహరణ వాఙ్మయం స్వీయప్రచురణ. కట్టావరదరాజు రామాయణం (4 సంపుటాలు) రాజగోపాల విలాసం పరిష్కరణ. తంజావూరి సరస్వతీ మహల్, ఖడ్గలక్షణశిరోమణి మద్రాసు ఓ.ఎం.ఎల్ ప్రకటించాయి. వ్యాసాలు, పీఠికలు మినహా వేంకటేశ్వరశతకం (కవిజీవితాలు), శివసర్వస్వం (కందాలు) సూర్యశతకానువాదం అముద్రితాలు. వీరికి 5 గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు.

ఓ నాన్నా!

కలిమికి గర్వపడక లేమికి వగవక మాకు తల్లిలేని లోటు

మరపించి విద్యాబుద్ధులు నేర్పి వివేకవంతులుగా తీర్చి

వివాహితులుగా, స్వార్జన సమర్థులుగా

చేసిన తండ్రివి - మా తండ్రివి నీవు

నీకిదే

మా కృతజ్ఞతాబద్ధమైన

ప్రణామాంజలి

సుందరేశ్వరరావు, పార్వతీశ్వరరావు, జగ్గారావు,

సర్వేశ్వరరావు, సూర్యనారయణ, జోగాబాయ్, లక్ష్మి

# వ్యాస క్రమం

## టూకీగా వ్యాసాల సారాంశం:

1. పాల్కురికి సోమనాధుని బసవపురాణానికి కన్నడానువాదం క్రీ.శ. 1369లో వెలిసింది. అయితే మూలకృతికి సంస్కృతానువాదం కూడా ఉందని చూచాయగా తెలిసినా దాని వివరాలు సంస్కృత బసవపురాణం అనే వ్యాసంలో తెలుస్తాయి. విశేషం ఏమిటంటే రేవణారాధ్యులు అనే యోగి రాజమహేంద్రవరంలో సోమలదేవి అనే రాచకన్యకను వివాహమాడటం, కోటిఫలి ఆరాధ్యులు పుట్టడం మొదలయిన వింత చారిత్రకాంశాలు వెల్లడియ్యాయి.

2. మల్లికార్జున పండితారాధ్యులు శ్రీశైలంలో జన్మించాడని అక్కడే పెరిగి పెద్దవాడయి దాక్షారామం వచ్చి కోటిఫలి ఆరాధ్యుల వద్ద దీక్ష పొందాడని తెలియటమే కాకుండా పండితారాధ్యులు కర్ణాటక బ్రాహ్మణుడని, బనవాసి ప్రాంతం నుండి తన తండ్రి భీమన ఏనాడో అంటే పశ్చిమ చాళుక్య అనంత పాలదండనాధుని కాలంలో వచ్చి భీమేశ్వరస్వామి పూజారిగా నియమితుడై ఉంటాడని, అతని శివతత్త్వసారం కందపద్యాలు ఏకముకుటం లేకుండా తీరిక సమయాల్లో వ్రాస్తూ వచ్చాడని తెలుస్తుంది. వెలనాటిచోడుని బౌద్ధగురువును చంపిన రేమయ దేవయలు కల్పిత పురుషులు కారని శాసనంలో పేర్కొబడినారనే విషయం కూడా స్థిరపడుతుంది.

3. బసవేశ్వరుని కాలము నాటి ఉత్తరాది నుండి వచ్చిన పాశుపత, లకులీశపుపత, కాలాముఖశైవులు వీరశైవములో కలిసి పోయి లింగవంతు లయ్యారని, వంగదేశమందలి దక్షిణరాఢామండల మునుండి దక్షిణదేశమునకు వచ్చిన పాశుపతశైవులే కాకతీయ గణపతిదేవునికి, ఆయన కుమార్తె రుద్రాంబకు రాచగురువులై వారి వల్ల అనేక భూదానములను గ్రహించి, మఠముల నిర్మించి విద్యామంటపములను, ఆరోగ్యశాలలను నెలకొల్పి ప్రజాభిమానము చూరగొన్నారని, బసవని వీరశైవము ఆంధ్రదేశమున అలజడి ఏమాత్రము సృష్టించలేదని 'గోళగి మఠములు - ఆంధ్రదేశము' అన్న వ్యాసం నిరూపిస్తుంది.

4. వేమన శివయోగి అని, ధర్మప్రామాణ్యానికి అతని పద్యాలు 17వ శతాబ్ది నాటికే సామాన్య ప్రజల ఆదరణ పొందినట్లు శాననాధారంతో 'శివయోగి వేమన' అనే వ్యాసంలో చెప్పడం జరిగింది.

5. యోగసిద్ధాంతాన్ని చక్కటి దేశి తెనుగున ప్రవచించి శివయోగాన్ని తెలియ చెప్పినవాడు కొలని గణపతిదేవుడు. ఇతని మనోబోధను చదివి వేమన ప్రభావితుడయ్యాడని ఆరుద్రగారు, ఇతరులు పేర్కొంటూ వచ్చారు. ఈ గణపతిదేవుడే శివయోగసార మనే వేదాంత గ్రంథాన్ని కూడా రచించాడు. 1950లోనే మనోబోధ నాచే పరిష్కృతమైంది.

# రెండే మాటలు

మా తాతగారు సుందరం పంతులు, మా నాన్నగారు వెంకటరావుగారు తెలుగుసాహిత్యక్షేత్రంలో శ్రమకోర్చి, నుదుటి చెమటను కొనగోళ్లతో తుడుచుకొన్న కృషీవలులు. వారిరువురకు అభిమానమైన మాగాణి శైవసాహిత్యము. "రాయంచలు కూయ క్రౌంచమును నావల కూయ గడంగిన భంగి కతిపయాక్షర పరిగ్రహ జనితంబైన నైసర్గిక చావలంబున" నీవ్యాసములను రచించితిని.

సర్వతోముఖప్రతిభా షడాననులు, మదీయ గౌరవ మిత్రులు శివశ్రీ శివలెంక రాధాకృష్ణగారు నాకనవరత ప్రోత్సాహమిచ్చి నా మేధావలయమును విస్ఫార జేసిరి. వారిపట్ల నా కృతజ్ఞత ఎల్లప్పుడు నున్నదే.

ఇట్టి వ్యాససంకలనము సర్వజనపరిగ్రాహ్యము గామింజేసి కేవలము ఆత్మతృప్తికి, పితృపితామహ శైవభక్తి తత్పరతకు చిహ్నముగా దీనికి శివార్పణం బని పేరిడితి.

చక్కటి ముద్రాపకులను పరిచయం చేసిన శ్రీ ఇందుకూరి సూర్యనారాయణరాజుగారికి, ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్ శ్రీ శంకర్ గారికి, శ్రీమతి నిర్మలగారికి విశ్వాసపాత్రుడనై కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

**కృతజ్ఞతలు: తెలుగు విశ్వవిద్యాలయం విస్తరణ సేవావిభాగం పి.ఆర్.ఒ శ్రీ జె. చెన్నయ్య, కుమారి బి. విజయశ్రీ గార్లకు**

**సుందరేశ్వరరావు**

అకలంకంబగు ధాత్రియుం దులసి భ
వ్యాతీత జంబీరకం
దకము ల్మావిలి పేళ్ల నొప్పి సురసం
తానంబునుం బిల్వపం
చకనామంబున మీఱు వానిఁ గొని పూ
జల్సేయుదుం భక్తి నే
నొకబిల్వంబు శివార్పణం బనుచు ని
న్నో విశ్వనాథప్రభూ! 1

నికటగ్రామతటాక నిర్మితి మహా
నిక్షేపముం బ్రాహ్మ్య ము
త్సుక సంస్థాప్యము, శైవమందిరముఁ గూ
తుం, గోట్ల దానంబు చా
లక వేయంత ఫలంబుల న్నొసఁగు బి
ల్వం బంది పూజింతు నే
నొక బిల్వంబు...

సకలోర్వింగల క్షేత్రరాజముల శ్రే
ష్ఠంబైన వారాణసీ
సుకరావాసము; జాహ్నవీస్నపనమున్

సోహం పరబ్రహ్మ వా
చకమున్ రేకులు మూటఁ గల్గుటను బూ
జల్సేయుదుం భక్తి నే
నొక బిల్వంబు...

ప్రకటారిష్ట వినాశహేతువు; త్రి
త్రత్ర్యాయుధంబుం దళ
త్రికము న్సత్త్వరజస్తమోగుణమయ
త్రిస్థానకంబుం ద్రయం
బకరూపంబగు బిల్వపత్రమును స
మ్యగ్భక్తిఁ బూజింతు నే
నొకబిల్వంబు

సకలాభీష్టఫల ప్రదాయకము సా
క్షాన్మోక్ష లక్ష్మీగృహం
తికఘంటాపథముం ద్రిశాఖయుత సం
దీప్తిచ్ఛటా క్రాంత సా
యకరూపంబగు బిల్వపత్రమును స
మ్యగ్భక్తిఁ బూజింతు నే
నొకబిల్వంబు

సకలద్వీపకలాప భూషణము నా
జాంబూ మహాద్వీప క

ల్పకమై దర్శన సంస్పృశత్వములఁ గ
ల్యాణంబులం గూర్చు సా
త్త్వికరూపంబగు బిల్వపత్రమున భ
క్తిం జేసి పూజింతు నే
నొకబిల్వంబు

చకితామంగళ సర్వమంగళము వి
శ్వాధీశు నర్ధాంగనా
యికముం దాలితభైరవమ్మునగు కా
శీక్షేత్రవాసంబు త
ప్పక వేయంత ఫలంబుల న్నొసఁగు బి
ల్వం బంది పూజింతు నే
నొకబిల్వంబు

శుకునిం దండ్రియుఁ దాతలోనగు విశి
ష్టుల్ శ్రేష్ఠమం దెంచి పూ
జకు నర్హం బని సర్వకాలముల సం
శ్లాఘింతురే బిల్వ పం
చకము న్మారెడుపత్రి యందు మణిపూ
సై యుంటఁ బూజింతు నే
నొకబిల్వంబు.

అక్షయ మాఘ బ - శుక్రవారం
18.2.1927 ఆంధ్ర పత్రిక.

# సంస్కృత బసవపురాణము

పాల్కురికి సోమనాథుని తెలుగు బసవపురాణమునకు క్రీ.శ. 1369 లో కన్నడానువాదము వెలసిన తరువాత 50 సంవత్సరములకు సంస్కృతానువాదము బయ ల్వెడలినది.

## కర్త - శంకరారాధ్యుడు

గద్యపద్యాత్మక మహాకవితా తత్త్వకోవిదుడును, ఏకాంబ్రనాథుని పరమభక్తుడును, కాంచీపురనివాసియు, వీరమాహేశ్వరాచార పరాయణుడును, షట్స్థలజ్ఞానియు నైన శంకరారాధ్యకవి ఈ అనువాదమునకు కర్త. ఇతడు కేశవామాత్యుడను మంత్రి శిఖామణి కోరిక తీర్చుటకు దేశభాషలోని బసవపురాణమును గీర్వాణభాషలోనికి పరివర్తనము కావించినాడు.

## కేశవామాత్యుడు

శ్రీమల్లికార్జున ధ్యాన నిష్ఠాదిష్ఠిత మానసుడైన మల్లయాఖ్యుడు యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యానకార విజ్ఞానేశ్వర ప్రవర్తితశాఖలో జన్మించెను. ఇతనిది శాండిల్య గోత్రము. మల్లయామాత్యుని కుమారుడు శ్రీరామామాత్యుడు. ఇతనికి అయ్యలామాత్యుడు కుమారుడు. ఈఅయ్యలుని భార్య అమలక్క. ఈపుణ్య దంపతులకు పుట్టినవాడే కేశవామాత్యుడు. ఇతని నివాసము శ్రీశైలగిరి సమీపములోని స్కందపురి. అది స్కంద, సోమేశదేవర, భైరవానంద దేవతలకు స్థానము. ఆ స్కందపురిని రెడ్డిజేంద్రులు రాజధానిగా జేసుకొని కొంతకాలము పాలించిరి.

## కందుకూరి రెడ్లు

వీరిని 'కందుకూరి రెడ్లు' యని రెడ్డిరాజ్యచరిత్ర కోవిదులు పిలుతురు. ఈ కందుకూరి రెడ్డివంశభూషణులలో శివలింగభూపతి దొడ్డప్రభువు. ప్రోలయ వేమారెడ్డి అనుగుదమ్ముడు మల్లారెడ్డి కోవలోనివాడగు నీశివలింగభూపతి హరదత్తాచార్యుని

చతుర్వేదతాత్పర్యసంగ్రహమునకు 'తత్వ ప్రకాశిక' యను వ్యాఖ్య రచించిన పండిత ప్రభువు. ఇతని సోదరుడు మాచ ప్రభువు.[1] కేశవామాత్యుడీ మాచప్రభువునకు మంత్రి మాణిక్యము. శివలింగ, మాచభూపతుల తండ్రి పినకోమటి క్రీ.శ. 1404 లో పెదపూడి శాసనము వేయించెను. కావున ఈ సోదరు లిరువురు 1430-50 ప్రాంతముల నుండి రనుట స్పష్టము. శంకరారాధ్యుని గద్య ఇట్లున్నది:

"ఇతిఖ్యాత మాహేశ్వర దివ్యపద పద్మ సౌరభ భ్రమరాయమాణ శరధినిమగ్నస్య ప్రమథకవేః శంకరారాధ్యస్యకృతౌ బసవపురాణే."

పై గద్యను బట్టి చూడగా నిది సోమన బసవపురాణ గద్యను పోలినదని నీ క్రింది యుదాహృత ద్విపద పంక్తులనుండి గ్రహింపవచ్చును.

*"ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య*
*పద పద్మ సౌరభ భ్రమరాయమాణ*
*జంగమ లింగ ప్రసాదోప భోగ*
*సంగత సుఖ సుధా శరధి నిమగ్న."*

(పాల్కురికి సోమన బసవపురాణ సప్తమాశ్వాస గద్య)

పై శంకరారాధ్యుడు ప్రమథకవి యని చెప్పుకొన్నాడు. ప్రమథకవి యనగా శివకవి యని చెప్పనొప్పును. ప్రమథకవి శ్రీగిరియను నాతడు పశ్చిమ గోదావరి భీమవరము తాలూకాలోని మోగల్లు గ్రామములోని భీమేశ్వరాలయమున నున్న శాసనములలో ప్రమథకవి శ్రీగిరిఅయ్యంగారు, శ్రీగిరిదేవయ్యంగారు పేర్కొనబడిరి (వేంకటరమణయ్య నేలటూరి - 27) నిమిష కవి, వార్తాకవి, త్వరకవి, బంధకవి ఇంటిపేర్లవలె ప్రమథకవి గృహోప నామకము స్థిరపడియుండును. లేదా శివధర్మశాస్త్ర విశేషరహస్య వివిధ దివ్యాగమ విరచితత్వమును శివానుగ్రహమును వీరు సంపాదించి ప్రమథేశ్వరత్వమును బడసి యుందురు.

శంకరారాధ్యుని గూర్చి విశేషముగా తెలియవచ్చుట లేదు. ఇతడు కంచినివాసి యని సంస్కృత బసవపురాణమును బట్టి తెలియుచున్నది. కంచి నుండి దేశసంచారము గావించుచు, నెల్లూరుజిల్లాలోని కందుకూరునకు శంకరారాధ్యు డెట్లు చేరెనో తెలియదు గాని స్కందపురి సోమేశుని వసంతోత్సవ మహోత్సవమును చూసి వచ్చిన శివభక్తులు బసవపురాణచర్వణము చేయుచుండగా కేశవామాత్యు

డచ్చటికి వచ్చి వారి పలుకు లాలకించి బసవేశ్వర పురాణమును సంస్కృతీకరింపగల సామర్థ్య మెవ్వరికి గలదని విచారింపగా అచ్చటి శివభక్తులు కంచినివాసి శంకరారాధ్యులు గలరని చెప్పగా కేశవామాత్యుడు శంకరారాధ్యుని రప్పించి, తెలుగు బసవపురాణ గీర్వాణ భాషాంతరీకరణ మాతనిచే చేయించి యాతనిని సత్కరించెను. శంకరారాధ్యుల శక్తి సామర్థ్యమును కేశవామాత్యుడు గుర్తించి స్కందపురియందే యాతనికి స్థిరవాసము కల్పించెను. శంకరారాధ్యులు కంచి నుండి బంధుమిత్రాదులతో తరలి కందుకూరు చేరుకొని అచ్చటనే స్థిరపడిరి.

ఇది బసవపురాణ గీర్వాణానువాదకర్త విషయము. ఇక మిగిలినది ఈ శంకరారాధ్యు లెవ్వరా యను విచికిత్సకు కథాశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రులవారును,[2] వేలూరి శివరామశాస్త్రుల వారును[3] విత్తును జల్లిరి. వారికీ సంస్కృతానువాదము కంట బడినచో ఈ శంకరు డెన్నడో వశంకరుడయి యుండును.

శంకరారాధ్యులు క్రీ.శ. 1380-1450 మధ్య ప్రాంతమున కంచి, నెల్లూరు ప్రాంతముల నుండిన వారని పైని పేర్కొనిన కథనమువలన స్పష్టముగా తేలుచున్నది. కందుకూరిరెడ్లు తొలుత పెదకోమటివేమారెడ్డి పక్షము వహించినను తుదకు విజయనగర సంగమవంశీయుల సార్వభౌమత్వము నంగీకరించిరి.

అయినను కందుకూరునకు సమీపముననున్న నెల్లూరు, అద్దంకి ప్రదేశములందు రెడ్డివైభవ ప్రాభవము లానాడు మెరసి పోవుచుండెను. క్రీ.శ. 1325-26 సంవత్సరమున ఎఱ్ఱా ప్రెగ్గడ రామాయణాంధ్రీకరణ కృతిస్వీకార మహోత్సవముతో రామలక్ష్మణుల వంటి ప్రోలయవేమారెడ్డి, మల్లారెడ్లు అద్దంకినగరము రాజధాని చేసికొని, రెడ్డి సామ్రాజ్యమును స్థాపించియుందురు. ప్రోలయ వేమారెడ్డి క్రీ.శ. 1353లో చనిపోయెను.

తరువాత అద్దంకి యందే వేముని కొడుకు అనపోతారెడ్డి సింహాసనాధిష్ఠ డయ్యెను. అతడు క్రీ.శ. 1364 వరకు పాలించెను. క్రీ.శ. 1340 నాటికి రెడ్డి రాజధాని అద్దంకి నుండి కొండవీటికి మార్చబడినట్లున్నది (మాంచాళ్ళ శాసనము - శ్లో. 11 రెడ్డి సంచిక అనుబంధము). అనపోతారెడ్డి తరువాత ఆతని తమ్ముడు అనవేమారెడ్డి కొండవీటి గద్దె నెక్కెను. ఇతని కాలము 1364-86. ఇతని యొద్దనే శృంగారనైషధ కృతిపతియైన మామిడి సింగనామాత్యుని తండ్రి పెద్దన 'రాజ్య భార భరణ వ్యాపార దక్షుఁడు' (1-27). పినతండ్రి కూడ నీ 'వేమక్ష్మాపతి రాజ్యభార ధౌరేయుడే (1-30).

ఈ సింగన మంత్రి ముత్తాత చిటిపెద్దనామాత్యుడు "విక్రమపురీ సింహాసన ధ్యాసియై" (1-22) వెలుగొందెను. చిటిపెద్దనామాత్యుని తండ్రిని గూడ 'నెల్లూరి తూర్కరాజ' (8-202) ని శ్రీనాథుడు పేర్కొనెను. దీనిని బట్టి చూడగా మామిడి సింగనామాత్యుని పూర్వీకులు నెల్లూరు వారని స్పష్టముగా తేలిపోవుచున్నది.

అనవేమారెడ్డి చనిపోవగనే అన్న అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరిరెడ్డి రాజ్యమునకు వచ్చి క్రీ.శ. 1402 వరకు కొండవీడును పరిపాలించెను. ఇతని సింహాసనమును పెదకోమటి వేమా రెడ్డి ఆక్రమించుకొని 1424 వరకు పాలించెను. ఇతని యొద్దనే నైషధ కృతిపతియగు సింగన సచివత్వము నెరపినాడు. రాజుగారితో పాటు శ్రీశంకరగురువు వద్ద దీక్షను పొందియుండును. లేక పోయినచో నీతనిని 'నవరత్నోపల దివ్యలింగ వరదాన ప్రీత దాక్షాయణీ (2-144) అని శ్రీనాథుడు సంబోధించి యుండెడి వాడుకాడు. కోమటివేముడు నెల్లూరికి సమీపములోని కందుకూరును మాచారెడ్డి కొడుకైన రెండవ కోమటిరెడ్డి నుండి జయించి తన యాధిపత్యమును స్థాపించెను. అప్పుడే నెల్లూరి నివాసియైన సింగనామాత్యుని గూడ తనకు మంత్రిగా నియమించియుండును.

దీని కింత చరిత్ర వ్రాయవలసి వచ్చినందుకు కారణముగలదు. అదే కాలమున కందుకూరి సోమేశ్వరస్థానమునందు మన శంకరారాధ్యు డున్నాడు. ఈ శంకరారాధ్యుడే పెదకొమటివేమ సింగనామాత్యులకు గురువేల కాకూడదు? అద్దంకి, నెల్లూరు ప్రాంతములో రాజ్యాభిలాషగల పెదకోమటివేమారెడ్డికి కొండవీటి దుర్గముపై ఆశ జనింపగా అద్దానిని పరిపాలించుచున్న కుమారగిరిరెడ్డిని రాజ్యపీఠమునుండి మామిడి సింగన తన "యవనాధీశ సభా నిరంకుశ వచో వ్యాపార పారాయణత్వ (2–144)ము"చే తప్పించి పెదకోమటివేముని ప్రతిష్ఠించి యుండును. (రె.రా.చ. పుట 162). కావుననే శ్రీనాథుడు తన కృతిభర్తయైన సింగనామాత్యుని 'వేమ సామ్రాజ్య రక్షామణి' యని సంబోధింప గల్గెను.

శ్రీనాథ, మామిడి సింగనామాత్యులు పాకనాటివారు (నెల్లూరి వారు). సింగనామాత్యునికి కంటె ముందుగనే సింగన యన్నయగు ప్రెగడన్నకు శ్రీనాథుడు నిగమార్థసారసంగ్రహమగు నారాధ్యచరిత్రను కృతిగా నిచ్చినాడు.[4]

'ఆదిగఁ బెక్కుల్' అని సింగన శ్రీనాథునితో పల్కుటచే 'శాలివాహన సప్తశతి'ని

గూడ నీతనికే ఇచ్చెనేమో!

పిండితార్థమేమనగా సంస్కృతబసవపురాణకర్తయగు శంకరదేశికులు - సింగన, పెదకోమటివేమారెడ్లకు గురువనియు వేమారెడ్డికి రాజ్యప్రాప్తి కలుగగనే తమ గురువులకు పినపాడు గ్రామదాన మొనర్చి రనియు చెప్పుట కవకాశము చాలినంత యున్నది. అయినను విజ్ఞులు దీనిని చర్చింతురుగాక. శంకరగురువున కిచ్చిన దానవిశేషమును నీ క్రింద నిచ్చుచున్నాను:

*దాతా కోమటి వేమనామనృపతిః పాత్రం గురుశ్శంకరః*
*స్థానం చే త్పినపాడు రత్రతుకవి శ్రీనాథ భట్టారకః*
*కాలాశ్చే చ్ఛివరాత్రి పుణ్యసమయస్సాక్షీ మహాన్ శ్రీగిరి*
*శ్రేయం కిం నతువర్ణ్యతే సుకవిభి శ్శృణ్వంతు తచ్ఛాసనమ్*

(పినపాడు తామ్రశాసనము, శృం. శ్రీ. పుట 119)

పైశాసనమునందు దానకాలము సూచితము కాలేదు. కాని "పినపాడు (గుంటూరు జిల్లా, తెనాలి తా.)లో మృత్యుంజయారాధ్యుల యింట నొకప్రాచీనతాళపత్ర గ్రంథమున నీదాన ప్రస్తావము వ్రాయఁబడి యున్నది. అందీ శ్లోకము కలదు:

*శాకాబ్దే గిరినేత్రమూర్తి విధుకే సంవత్సరే పార్థివే*
*మాఘేఽస్మిన్ శివరాత్రి పుణ్యదివసే శ్రీ వీరనారాయణః*
*తస్మై శంకర దేశికాయ విధుషే భద్రానదీ ప్రాక్తటే*
*గ్రామం శ్రీ పినపాడు ముత్తమ మదాచంద్రమా తారకం.*

శా.శ. 1327 అగు పార్థివ సంవత్సర మహాశివరాత్రి పుణ్యకాలమునఁ బెదకోమటి వేమభూపాలుఁడు పినపాడు గ్రామమును శంకరదేశికునకు దానము చేసెనని మీఁది శ్లోకమున కర్థము." (శృం. శ్రీ.పు 119)

పైశాసనమునుబట్టి పెదకోమటివేమారెడ్డి (1402-20) గురుశంకరునకు పినపాడును తన విద్యాధికారి శ్రీనాథుని సమక్షమున క్రీ.శ. 1405లో దానము చేసినట్లు స్పష్టము.

పెదకోమటివేమారెడ్డి, శ్రీనాథుడును, శంకరదేశికులును నొకే శాసనమున సమకూరినపుడు పెదకోమటి వేముని మంత్రి యగు మామిడి సింగనామాత్యునకు

వేరొక గురువు సనామధేయు డొక డుండునా యను సంశయ ముత్పన్నమగును. అది సహజమే. సింగనామాత్యుడు కృతిగొన్న శృంగారనైషధము నందు -

*శ్రీ గురుశంకరమౌనిద*
*యా గౌరవ నిత్యవర్ధితాన్వయ!* (6-1)

అని చెప్పబడి యుండుటచేతను, గురుశంకరమౌని దయాగౌరవములకు మామిడి సింగనామాత్యుడును పాత్రు డగుటచేతను పెదకోమటివేమభూపాల, మామిడి సింగనామాత్యులకు నొకే గురువు శంకరమౌని యని స్పష్టమగుచున్నది.[5]

**సంస్కృత బసవపురాణము - కన్నడ భాషాటీక**

పైన చెప్పిన శంకరారాధ్య కృత గీర్వాణానువాద బసవ పురాణమునకు గురుపాదాఖ్య దేవుడను నాతడు క్రీ.శ. 1592లో కర్ణాటభాషలో టీకను వ్రాసెను. దానికి 'సర్వార్థదాయినీ' అని పేరు. ఈ గురుదేవుడు తాను ద్రాక్షారామములోని కోటిపల్యారాధ్య దేవుని వంశములోనివాడ నని టీకా ప్రారంభమున చెప్పుకొన్నాడు.

**గురుదేవకవి వంశము**

(సర్వార్థదాయిని)
దాక్షారామ కోటిఫలి ఆరాధ్యులు
భీమ పండిత (గౌరమాంబ - పత్ని)
మల్లికార్జున పండిత (వెలనాటి చోళుని ఆస్థాన పండితులతో వాదము జరిపెను)
(వంశములో)
పండితారాధ్య దేశిక- వీరారాధ్య- గురు బసవేశ-బసవేశ
గంగాధర – గురు బసవేశ
హిరియార్య - పండితార్య - గురులింగదేవ
గురుదేవ క్రీ.శ. 1592 - పండితార్య - బసవారాధ్య -జక్కారాధ్య

**కోటిఫలి ఆరాధ్యులు - విశేషాంశములు**

పంచబ్రహ్మోదయ భాష్యమను సంస్కృత గ్రంథమున కోటిఫలి ఆరాధ్యులను గూర్చి కొన్ని శ్లోకములు వ్రాయబడినవి.

"తద్ది భూలోక మధ్యేషు రేణుకాచార్య కోవిదః ।
ద్వాదశాబ్దం జరత్యంచ పండిత ప్రవరాత్మ జా ॥

పురా కైలాస వ్యాసోక్త ప్రసాద క్రమవర్తనే ।
రేవణారాధ్యః శ్రీవీరశైవరత్న ప్రకాశక : ॥

త్రిలింగదే కామ్యార్థపురీశే రాజమందిరే ।
సోమలాదేవి వైవాహం కృతం శాస్త్రోక్త సమ్మతం ॥

దంపత్యాశ్రమ సంయుక్తో వత్సర త్రీనో సమాచరతే
సోమలాగర్భ కంజా తు కోటిపల్లార్య యుద్ భవః" ॥

త్రిలింగదేశములోని రాజమహేంద్రవరమున సోమలాదేవి యను నామెను రేవణారాధ్యుడు శాస్త్రోక్త సమ్మతముగా వివాహమాడి, మూడుసంవత్సరములు దాంపత్యజీవితమును గడపగా వారిరువురకు కోటిపల్యారాధ్యులు పుట్టిరని పై శ్లోకముల వలన తెలియుచున్నది.

మల్లికార్జునపండితారాధ్యులకు దీక్ష నిచ్చిన దీక్షాగురువులును కోటి పల్యారాధ్యులే.

...... .... ... ... దుర్వార సంసార
దూరవీరవ్రతోద్ధుర వర్తనుండు
శైవధర్మోత్తమాచార్యుఁడ
దైవుండు నద్వైత తత్త్వతత్పరుఁడు
న్యాయ వైశేషికోదాత్త శాస్త్రాన
పాయ దర్శన పరిపాలన క్షముఁడు
స్వకృపావలోక నోత్సారిత శిష్య
నికర మలత్రయ నిష్ఠితేంద్రియుఁడు
దంత్రాధిగత వీరతంత్ర స్వతంత్ర
మంత్రాది గత రాజమంత్ర సిద్ధుండు
వేద వేదాంత వివిధ పురాణోప
పాదిత కేవల భక్తివర్ధనుఁడు
పండిత నత పాదపద్ముండు సుకవి

మండలి విబుధసమాజపూజితుఁడు
ఆరూఢ కీర్తిశుఁడగు కోటిపల్లి
యారాధ్యు లనఁగ లోకారాధ్యమూర్తి°
(పండితారాధ్య చరిత్ర దీక్షా. 23-24 ఆంధ్ర గ్రంథమాల 1939.)

మల్లికార్జునపండితారాధ్యులు క్రీ.శ. 1130లో జన్మించి, 65 యేండ్లు జీవించి 1185 నాటికి మరణించి యుండవచ్చునని నేలటూరివారు రాద్ధాంత సిద్ధాంతములు చేసి నిర్ణయ మొనర్చినారు. (సోమనాథుఁ డెప్పటివాఁడు, పుట 30. 1955)

కోటిఫలి ఆరాధ్యులు క్రీ.శ. 1080-1150 మధ్యకాలమున దాక్షారామమునకు సమీపములోని కోటిఫలి యం దుండి యుండును. ఆకాలమున రాజరాజు మనుమడును కుళోత్తుంగచక్రవర్తి కుమారులునైన వీరచోడుడు (1078-1084), విక్రమచోడుడును (1118-35) తండ్రి పనుపున వేంగీరాజ్యము నేలు చుండిరి.

పంచబ్రహ్మోదయభాష్యము ప్రకారము కోటిఫలి ఆరాధ్యులు సోమలదేవి రేవణారాధ్యుల తనయుడని తెలియుచున్నది కదా! ఈ సోమలదేవి తూర్పు చాళుక్యరాజు కుమార్తె కాదు గదా!

క్రీ.శ. 1065 లో రాజరాజ నరేంద్రుని సవతి సోదరుడగు వీరవిజయాదిత్యుని భార్య రేవలదేవి కూతురు సోమలదేవి దాక్షారామ భీమేశ్వరునకు మణిబంధము, బంగారముతో జేయబడిన కల్పవృక్షపుష్పము, వెండిమండతో అఖండద్యుతి దీపము దానము చేసెను. (182/1893. ద. హిం.శా. 4 వ. సం. నెం. 1007) ఈమె జగదేక సుందరి, గుణారామ, మత్తేభ మందగమన యని పేర్కొనబడినది. ఈమెయే కోటిఫలియారాధ్యుని భార్య యెందుకు కాగూడదు? "అన్వయాభివృద్ధికి భూసురోత్తములు క్షత్రియ రాజపుత్రికల యందు ధర్మవిధి సంతతి నిలుపుచుండిరి. చాలుక్యవంశ సంజాఁతలను కులబ్రాహ్మణుల కిచ్చి వారి వలన కలిగిన సంతతితో, చాలుక్యవంశము నిలుపను, సంబంధ బాంధవ్యములను గలుపుకొనుచుండిరి" (భావరాజు వెంకట కృష్ణారావు. రాజరాజనరేంద్రుడు. పు 144. 1950).

అట్టియాచారము కాకతీయుల కాలము వరకు చెల్లుబడి యగుచుండెను. తిక్కన వంశములో మనుమసిద్ధి నామధారులు, కొలని వారి వంశములో గణపతి, రుద్రనామధేయు లెందరు లేరు. కావున ఆనాడు సోమలదేవి రేవణారాధ్యుల

వివాహము శాస్త్ర సమ్మతమే. భాష్య పంక్తులలో "సోమలాదేవి వైవాహం కృతం శాస్త్ర సమ్మతం" అని యుండనే యున్నది గదా!

ఇక ఈ రేవణారాధ్యు లెవరు?

వీరశైవ సిద్ధాంతమును దెల్పు వీరాగమములో

*రేవణో మరుసిద్ధేశో రామదేవో మునీశ్వర : ।*
*పండితారాధ్య ఇత్యేతే చతుర్మఠ మునీశ్వరాః ॥*

(వేటూరివారి పీఠికలు బ పు. పీ. పు. 223.)

అని చతుర్మఠాధిపతులలో నాదిమఠాధిపతిగా రేవణసిద్ధుడు స్తుతింపబడినాడు. రేణుక, రేవణ శబ్దములు పర్యాయ పదములని శైవమతాభిలాషుల కెల్ల తెలిసిన విషయమే. పాల్కురికి సోమనాథుడు గణసహస్రనామస్తవములో కోటిపలి ఆరాధ్యునితో బాటు రేవణదేవుని గూడా పేర్కొనినాడు. (పం. చ. మహిమ 88, 92,). రేవణ, మరుళ, ఏకోరాములకు సిద్ధత్రయమని ప్రచారము కలదు.

కన్నడమున ఈరేవణ (రేణుక) సిద్ధుని గూర్చి 'కర్ణాకట సంస్కృతియ సంశోధన' యందు శ్రీ కపర్తాల కృష్ణారావు గారు విపులముగా చర్చించి పశ్చిమ చాళుక్య, చోళమండల రాజాధీశులకు నీతడు చూపిన మహిమలను వర్ణించి, కొల్లిపాక నుండి చోళమండలము, కొల్లాపురము నుండి వారణాసి, అక్కడి నుండి రేవణుడు శ్రీలంకకు ఆకాశగమన మొనర్చెననియు, నీతడు సిద్ధ సంప్రదాయమునకు చెందిన వాడనియు, కాలము క్రీ.శ. 1050-70 అనియు నిష్కర్ష చేసిరి. (పుట 13 రేవణ సిద్ధన ఉత్పత్తియ కల్పనయ వికాశ మత్తు అవనకాల) కృష్ణరావుగారి వ్యాసములో నీ పంచ బ్రహ్మోదయవిషయము నందలి సోమలాదేవి వృత్తాంతము లేదు. మరియు

*"శ్రీమద్రేవణ సిద్ధస్య కుల్యాపాక పురోత్తమే*
*సోమేశ లింగాబ్జ న నమావాస : కదలీపురే (స్వాయంభువాగమే)*
*అథ త్రిలింగవిషయే కుల్యాపాకాభిధా పురే*
*సోమేశ్వర మహాలింగత్ ప్రాదురాసీత్ సరేణుకః ॥*

(సిద్ధాంత శిఖామణి-)

అను శ్లోకములను బట్టి చూడగా రేవణుడు త్రిలింగ దేశములోని కొల్లిపాకయందు

సోమేశ్వరలింగము నుండి ఉద్భవించినట్లు స్పష్ట పడుచున్నది.

నేటి నల్గొండజిల్లా భువనగిరితాలూకా కొల్లిపాక క్రీ.శ. 1050 నాటికి గొప్ప శైవక్షేత్రము. అక్కడ మఠమొకటి యుండెడిది. పశ్చిమ చాళుక్య ఆహవమల్ల మొదటి సోమేశ్వరుడు అందలి స్థానాపతియైన విప్రసోమ భట్టారకుడు చండిమయ్య యను నాతనికి కొంత భూమిని దానము చేసెను. ఇతడు సోమ సిద్ధాంతాభిప్రాయమును బాగుగా నెరిగినవాడు. మహావ్రతి - (పరబ్రహ్మ శాస్త్రి. ఎస్.ఇ. ఏ.పి. నెం. 4) క్రీ.శ. 1106 శాసనమున "దివ్య తీర్థస్య సోమేశ్వరోత్తర తీరే ... సోమేశ్వర ..." అని సోమేశ్వరరాలయము, మఠము పేర్కొనబడినవి (అదే. నెం. 8). ఈ కొల్లిపాక పశ్చిమ చాళుక్యుల కాలమున గొప్ప రాజకీయ కేంద్రము.

తూర్పుచాళుక్యప్రభువగు రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరము రాజధానిగా పరిపాలించుచున్న రోజులలో కొల్లిపాక గొప్ప శైవ క్షేత్రముగా నుండెడిది. రాజరాజ నరేంద్రుని సవతితమ్ముడైన విజయాదిత్యుని కూతురు సోమలదేవిని రేవణ సిద్ధుడు వివాహమాడెనని పంచబ్రహ్మోదయ పీఠికా శ్లోకములు పరంపరగా వచ్చిన కథలను పేర్కొని యుండును. రాజరాజుకాలమున రేవణ సంప్రదాయమునకు చెందిన కాశీనాథ యనువారు రాజరాజనరేంద్రులకు గురువులుగా వ్యవహరించినట్లు పులివర్రు కైఫీయతు (ఎల్.ఆర్.సం.14.) చాటుచున్నది.

తగినంత శాసనప్రామాణ్యము లభింపకున్నను కాశీనాథయ్య (నేటి కాశీనాథుని ఇంటిపేరు గల వారికి మూలపురుషులు) రాజరాజనరేంద్రునికి, విజయాదిత్యునికి రేవణారాధ్యులు దీక్షా గురువులుగా వ్యవహరించి యుందురు.

పాల్కురికి సోమనాథుడు కోటిపల్లి ఆరాధ్యుని గురువు అవాంతరయ్య యని పండితారాధ్య చరిత్రలో వ్రాసినాడు

# అనుబంధము

## శంకరారాధ్య - వృషభేశ్వర పురాణము

జయతి శ్రీ గిరిర్నామ గిరిర్గరిమభూషితః
యత్రాస్తి భ్రమరాదేవ్యా దేవః శ్రీ మల్లికార్జునః
తస్యాగ్నేయ దిశాభాగే భాగధేయ మివావన :
పరిష్కృతస్తీర్థసార్థైః పూజ్యతే పుణ్యపురుషై :
తత్ర స్కందపురం నామపురం భూలోకభూషణం
విద్యతే స్కంద సోమేశస్స్వామీ యత్ర జగత్పతిః

(సంస్కృత బసవపురాణ తాళపత్రప్రతి హసన్‌జిల్లా అదే తాలూకా కోడి మఠమున దొరికినది. కోర కాగిత ప్రతి ... జిల్లా బీగల్ కోటి తాలూకా బీళగియ శ్రీ సోమప్పయ్యన విరక్త మఠము లోనిది. ఈరెండుప్రతులు గురుదేవకృత కర్ణాట భాషటీక 'సర్వార్థదాయిని'తో కూడుకొన్నవి. ఈ రెండును పరిశీలించి డా. శి. జి. నందిమఠ్‌గారు 'వీరశైవ' పత్రిక (డిశంబరు 1960 సం. 1. సంచిక 3.)లో 'సంస్కృత బసవపురాణగళు' అను శీర్షికతో వ్యాసమును వ్రాసిరి. ఈ సంచికను (కైలాసవాసి) వే. నరసింహారెడ్డి, నేనును చదివి విశేషములను వ్రాసుకొన్నాము.

## వేమభూపతి

యతో పితృవ్యేన హేమాద్రి దానినా శ్రీగిరౌకృతా
సోపాన పద్ధతిః స్వర్గ నిశ్రేణిరివరాజతే
కావ్యం రామకథాభవ్యం తతోపితృవ్యాభిధాంకితం
వర్తతే సర్వవిదుషా మాహ్లాద ముపపాదయత్.

## కందుకూరి మాచా రెడ్డి

శ్రీమాన్ సోమమహీపాలః శివలింగ క్షమాపతిః
కుమార మాచ భూపాలః కుమారః శ్రీగిరీశ్వరః

## కేశవామాత్యుడు

కుమారమాచ భూపస్య తస్య భూపశిఖామణేః
అమాత్యః సత్యసంపన్నో విద్యతే ఽస్యాః కృతేపతిః
శ్రీ మల్లికార్జున ధ్యాన నిష్ఠాదిష్ఠిత మానసః
తస్యాయాన్వయాఖ్య వైదగ్ధ్యం కీర్తించ విన్వణోమ్యహం
నానావిధానాం వాదనాం జేతా విజయ మన్మధః
యాజ్ఞవల్క్యాభిధానో భూత్తాపసః తపసాం నిధిః
యత్కరాంభః శకరేణ ప్రోషితో ఽభవదంచితః
విశ్వం భరద్వాజశాఖా స్తంభః స్తబిక పల్లవైః

*　　　　*　　　　*

యతోకృత స్మృతి వాక్యానాం వ్యాఖ్యానా ద్విశదా కృతాః
విజ్ఞానేశ్వర నామాసీద్ విఖ్యాతో విబుధాగ్రణీః
తతో ప్రవర్తిత శాఖాసు పురం ప్రావీణ్యమాప్తవాన్
బభూవ మల్లయాభిఖ్యః పురాభూసుర శేఖరః
శ్రుతిస్మృత్యయ నాధ్వన్యః శాండిల్య తాపసోత్తమః
గోత్ర ప్రవృత్తికో యస్య పాత్రం శాస్త్రార్థ సంపదాం
మననీయస్య మహతాం తస్యమల్లయ మంత్రిణః
పుత్రః శ్రీరామనామాభూత్ పవిత్ర నిజవర్తనః
శ్రీరామమంత్రిణస్తస్య తనయో వినయాన్వితః
అయ్యలామాత్య నామాసీ దనర్ఘ్య మణిభూషణ :
అధీతవిద్యం స్నానార్థం వీక్ష్యేతతః పితా
వధ్వాసమేత మతనో దమలక్కాభిధానయా

*　　　　*　　　　*

దినే ద్వాదశమే పుణ్యావేలాయాం బంధుభిః సహ
పితా కేశవనామాన మతనో దాత్మసంభవం
శాస్త్ర సాహిత్య సంగీత గోష్ఠీబి స్తద్విదాం ముదం

వితన్వన్నవ సత్త్యాగ వ్రతనిష్ఠః సకేశవః
అశేషాశ్రితటాశ్రాంతా తద్విదోజినా
అగాధాం తద్గుణ కథా మహోజన్మాచ భూభుజే
రాజకార్య ప్రమాదిత్వాత్ రాజచిత్త సురంజనం
కర్వన్నవర్తత సదా కేశవో మంత్రిశేఖరః

* * *

## పంచబ్రహ్మోదయ భాష్యములోని వంశాను క్రమణిక

రేణుకాచార్య - భార్య సోమలదేవి - కోటిపల్లార్యుడు - విశ్వనాథార్యుడు - వీరభద్ర - వీరణారాధ్య - చిక్క వీరార్య - రుద్రముని - వారణాసీశు సర్వేశ - రేవణసిద్ధ ఋత్విజు - సోమనాథుడు - లింగణారాధ్యులు - వీరణారాధ్యులు - వీరార్యు - రేవణ సిద్ధ దేశికః.

### అధోజ్ఞాపికలు

1. కందుకూరి రెడ్ల వంశవృక్షమున నీ మాచ భూపతియును, నీతని తమ్ముడు శ్రీగిరియును నుదాహృతులు కాలేదు.(రె.రా.చ.మ.సో.శ. 197 వ పుట)
2. "శంకరకవికృతిగా సంస్కృతబసవపురాణమును కర్ణాటకవిచరిత్ర పేర్కొనుచున్నది. అది ఇదిగాక వేఱొకటి కావచ్చును. (బసవపురాణ పీఠిక, పుట 32, 1926)
3. ఎఱ్ఱనగురువు శంకరమౌనిని గూర్చి వ్రాయుచు "బసవ పురాణమును సంస్కృతీకరించిన శంకరారాధ్యుఁ డెవ్వఁడో తెలిసికొనవలెను." (నృసింహపురాణ పీఠిక, పుట 4 వావిళ్ళ, మదరాసు 1953).
4. కృతికర్త కృతికన్య నిచ్చి కృతిభర్తకు ధారవోయును. కృతికర్త, కృతిభర్తల మధ్య నేర్పడిన సంబంధమును వైవాహికపద్ధతిగనే తిక్కనాదులు గ్రహించిరి. అట్లయినచో భారద్వాజసగోత్రీకులయిన సింగన, శ్రీనాథులు కృతిభర్త, కృతికర్త లెట్లయిరో దురూహ్యముగా నున్నది. బహుశా కృతికన్యలను నిచ్చుటలో గోత్ర విషయమై అంత పట్టింపు యుండి యుండక పోవచ్చును.

5. కాంచీపురమునందు గండగోపాలుడను తెలుగుచోళరాజు తన గురువగు శంకరయోగికి అంబికాపురమను గ్రామమును 108 మంది బ్రాహ్మణులకు భోజన నిమిత్త మిచ్చినట్లు తామ్రశాసనము కలదు. (EI. Vol No. XIII పుటలు 194. 197). ఈ శాసనకాలము 1291 - అని కొందరును, 1351 అని కొందరును చెప్పుచున్నారు. ఎఱ్ఱాప్రగడ గురువు శంకరస్వామి యొకరు కలరు కదా! (హరి పూ. 1-10, నృ పు. 1-11) ఈ శంకరస్వాము లిరువురను నీ సందర్భమున స్మరణకు తెచ్చుచుంటినేగాని గుర్తించు ప్రయత్నము చేయలేదు.

6. *శ్రీమత్కోటిఫలీపురీవర శివప్రాసాద సంవాసినం*
*లింగాంగైక్య విమర్శ దర్శన విదం వేదార్థ సంవేదినం*
*శశ్వత్స్థాపిత శైవధర్మ సమయం శిష్య ప్రశిష్యాన్వితం*
*విశ్వారాధ్య గురుం నమామి సతతం విశ్వాభివంద్యం విభుం॥*

అని శైవపంచక మందలి యారాధ్యస్తుతులలో గలదనియును, కోటిఫలి యారాధ్యులకు విశ్వారాధ్యులని పేరున్నట్లును శైవమత ప్రకాశిక (సంపు 5, సంచిక 2, పుట 20) లో ముదిగొండ రామలింగ శాస్త్రి గారు వ్రాసిరి. బహుశః దీనికి ప్రమాణ మీ శ్లోకమే అయి యుండనోపు!

# జగద్గురు
# మల్లికార్జున పండితారాధ్యుడు

## అవతరణ

శివుడు శ్రీ వృషాధినాయకునకు బసవనామం బిడి ప్రమథానుమతిని భూలోకమునకు పంపు సమయమున అనుపమ పరమపరానంద మొసగు తన పాదభక్తియు, నందికేశు సర్వజ్ఞతయు, భృంగి సహజనిష్ఠ, దుర్వాసముఖ్యుల ధ్రువశాపశక్తి, అక్షపాదాదుల వాగ్విచక్షత, ఉపమన్యు సద్గురుత్వము, రుద్ర ప్రమథ గణాధిపుల సహజ స్వకీయ ప్రసాదైకరతియు, ప్రాక్తన, నూతన భక్తగణముల వ్యక్త దృష్ట ప్రత్యయారూఢ మహిమ, వీరభద్రుని శౌర్యము - వీని నన్నింటిని ఒకమూర్తిగా దలప, ఆ తలపు మూర్తీభవించినది. ఆ మూర్తి పరమేశ్వరునకు చాగిలి మొక్కెను. దానికి శంభు డానంద మొంది నానాపురాణవిజ్ఞాన మొసగి

"బసవకుమారుని పజ్జను నీవు
వసుధకు శివభక్తి వర్ధనార్థముగ
నరుగు" మని యాదేశించెను.

మరియు నా పరమేశ్వరుడు తాను మానవరూపధారియై భూలోకమున కొచ్చి శిష్య ప్రశిష్య ప్రసిద్ధు గావించి, లోకగురుత్వము, అనపుశాపానుగ్రహ సమగ్రత,శివమహత్వప్రతిష్ఠిత వచస్సిద్ధి, శివతత్త్వసారసంచిత కళావృద్ధి, శివయోగ సంపత్సమృద్ధి, అమిత దృష్ట ప్రత్యయాంచిత మహిమ, ఘోరనిస్సారసంసారవారాశి పారగత్వము మొదలగు శక్తులిచ్చెదనని యామూర్తిని దీవించెను. శివు డింకను నిట్లు చెప్పెను.

వేంగీ మహోర్వీస్థలమున దక్షారామమున శ్రీ భీమేశ్వరోరులింగము సముద్యన్మహా

మహిమ నొప్పారుచుండును. అద్దేవు పురోహితశ్రేష్ఠుడు భీమనపండితుడు విద్వన్మహిష్ఠుడు, వీరభక్తిసత్తముడు, సద్బ్రాహ్మణోత్తముడు. వానస వంశవర్ధనకరుడు. ఆతడు పుత్రార్థియై శ్రీదివ్యపంచాక్షరీ శుభమంత్రమును శుద్ధాత్ముడై బహుపురశ్చరణలు పాటించి (శివుడామూర్తితో మాట్లాడుతున్న సమయమున) శ్రీగిరి మల్లికార్జునుని సన్నిధిని ఆజ్ఞ యొసంగనొక పురశ్చరణ కావింపుచున్నాడు. అతనికి యుదయింపు మనుడు వెంటనే ఆమూర్తి భీమాఖ్య సాధ్వి గౌరాంబగర్భమున ప్రవేశించె. మల్లికార్జున కృపాసంభూతు డగుటచే గౌరాంబా భీమపండితులు తమ బిడ్డనికి మల్లికార్జును డని పేరు పెట్టిరి. ఆ పేరుతో పండిత మల్లికార్జునుడు దక్షారామమున కొచ్చి కోటిఫలియారాధ్యుల హస్తమస్తక సంయోగమును, దీక్షను వీరశైవోక్త విధిని పొందెను.

మల్లికార్జునపండితు డీవిధముగా నొక కొత్తపద్ధతికి లోనై ఒడల నిండ విభూతిని పూసుకొని, రుద్రాక్షలు, లింగమును ధరించి దక్షారామమున దిరుగుచుండగా నచ్చటి భూసురులు, నరులు పండితయ్యను జూచి సైపక

పండితయ్యా! నీవు పౌరాణికుఁడవు
సద్విజోత్తముఁడవు, సచ్చరిత్రుఁడవు
విద్యాంసుఁడవు, వేదవిదుఁడ వట్లయ్యు
భూతియు, రుద్రాక్షములు దాల్పనగునె?
నీతియే లింగసన్నిహితమైన యున్కి
పాదోదకంబుఁ బ్రసాదంబు గొనఁగ
భూదేవతార్హమే వైదికమతమె?
హరి విరించ్యాది సురాసురముని ని
కరముఁ దాల్చిన వారుఁ గలరె మున్నాది''

అని ప్రశ్నించిరి. పండితుడు చిరునవ్వు నవ్వి వారికి విభూతి, రుద్రాక్ష, పాదోదక,

లింగార్చన, లింగధారణ, ప్రసాదస్వీకారాది వీరవ్రత విధులు వేదేతిహాసపురాణాదుల నుండి యనేక సాక్ష్యములను గుమ్మరించి తెలియజెప్పగా నా విప్రులు పండితుని కీర్తించి తమతమ వీళ్లపట్టున కరిగిరి.

పోరండ్ల సూరసానమ్మ, శ్రీ బెల్దేవి వేమనారాధ్యు లాదిగా నలరు జంగమములు (దక్షారామముననున్న) పండితారాధ్యుని జూచు వేడుక బయలుదేరిరి. దక్షారామమున పండితు డొకనాటి మధ్యాహ్న వేళ లింగార్చ నోద్యుక్తు డయ్యెను.

పండితుడు కరస్థలమున లింగమున్న సంగతి మరచి వారిదర్శనము జంగమదర్శనముగా భావించి లేచి వారికి మొక్కగా కరస్థల మందున్న లింగము అంతరిక్షమున కెగసి యుండెను. పండితయ్య వారిని కౌగలించుకొని సాష్టాంగుడై లేచు వరకు ఆలింగ మట్లే యుండి తిరిగి పండితుని దేహమున చేరెను. ఇక్కడ లింగార్చన కంటె జంగమార్చన ఉత్తమ మని తెల్పుట.

పండితుని శివార్చనా నియతికి, జంగమనిష్ఠకు వారు అద్భుతానంద పరవశులయి కొనియాడిరి. ఆనాడు ప్రఖ్యాతు డయిన బసవన్న చరితమును పండితునకు వినిపించిరి. (అందువారు పుట్టుక మొదలు జంగమ పారవశ్య సద్భక్తియందు బసవన చూపిన అద్భుత చర్యలు చెప్పబడినవి.)

పండితారాధ్యు డొక్కనాడు తానును శిష్యవర్గము సుప్రభాతమున నుత్సుకత మేల్కాంచి పువ్వులు గోయుచుండిరి. తన శివార్చన సమయమునకు ముందు నెవ్వరేని కోసుకొని పోవుదురోయని తుమ్మెద లందలి మధువును గ్రోలక మునుపు వెంటనే వెల్లగొండ మహాదేవయ్య యను భక్తుడు లేచి ముందుకు సాగగా శివార్చోపకరణములు కాళ్లకు తాకెను. తనరెండు కాళ్లను గుత్తుల వరకు గడికొండలుగా మహాదేవయ్య యను భక్తుడు తన రెండు కాళ్లను గుత్తుల వరకు గడికొండలుగా నరికి కొనెను. మహాదేవుని వీరభక్తికి పండితుడు మెచ్చుకొని శరణు వేడెను. మృదుదీపతైలంబు దెచ్చి తున్కలును గుత్తులును జక్కొల్పి సంధించి విభూతి మంత్రించి వాటిపై జల్లెను. మహాదేవయ్యకు కాళ్లు వచ్చినవి. అచ్చటనున్న శివభక్తు లందరును పండితుని మహిమను చూసి ఆశ్చర్య చకితులయిరి.

## చందవోలులో వెలనాటిచోడుని సభ: పండితుని వాదజయము.

పండితుడు చందవోలను పురి యందు మహాసద్భక్తి మహిమతో వర్తించుచుండెను.

అతని సర్వజ్ఞత్వము, శీలసంపద చూడజాలక వెలనాటి చోడనికి గురుడగు బౌద్ధుడు తన శిష్యుని రావించి పండితయ్యతో వాద మిప్పింపుమని, శైవము మోక్షైక సాధనము రుద్రుడే దైవమను వార్త వాదింతునని తన యేలికను కోరెను.

"బౌద్ధదర్శనపట్టబద్ధుండు గురుఁడొ
శుద్ధ వైదిక శైవబద్ధుండు గురుఁడొ" (పం.చ వాద. 116)

తేల్చివైచెద నని చెప్పెను. చోడడు ఊరిలోన వారినెల్ల పేరు పేరున బిలిపించుటయేగాక

"ఊర నీసభకు రా కొకడు సిక్కినను
ధారుణీశ్వరునాజ్ఞఁ దప్పినవారు
సుండో" యనుచు బురిచుట్టు చాటించె .

పండితుడు సభకు వెడలెను. ఆయన వెంట

"పరమ లింగార్చనపరులు స్వాధ్యాయ
పరులునై చను మహాబ్రాహ్మణోత్తములు"

వేదభాష్యములు చదువుచు, చెప్పుచు వచ్చిరి. వేమనారాధ్యులు, సూరసానమ్మ వారి వెంట నుండిరి. పండితుడు పరవాది మత్తేభ పంచాననుడువలె నుండెను. శ్రుతివిరుద్ధము, భవపాశబద్ధము, భువి నిషిద్ధము, దుఃఖ సమృద్ధము, పాపబద్ధము శుద్ధయబద్ధమని బౌద్ధమును, నితర సమయములను పాశుపత మతముతో సరికావని వాదించి తుదకు

"గౌరీశు మీఁద
దైవంబు లేఁడని తలయిచ్చి పడయు
దును, మంటఁ బట్టుదు, దొడరిన గెలుతుఁ
బనుగొన వాదజల్ప వితండములను
జెలగి, యట్లునుగాక శివుమీఁద నొకఁడు
గలఁడన్న నాయఱకా లెత్తి వారి
నడుఁదల దన్నుదు నాదు ప్రతిజ్ఞ
యెడపక యేను గాలెత్తితి ననుచు"

శ్రీమహాదేవుమహిమ నారూఢముగా మల్లికార్జున పండితు లాద్యు లౌనన బ్రతిష్ఠించె. (పం.చ. వాద. పుట 162)

## బౌద్ధగురుని హత్య: పండితునికి అక్షిదండన

బౌద్ధగురువు నోరు మెదల్పలేక సభాస్థలిని విడిచెను. లోకగురుత్వము, పండితత్వము మల్లికార్జునారాధ్యుల వారికే తగునని పౌరులు,బుధులు కీర్తించిరి. ధర పుట్టిన సాక్షాత్ దక్షిణామూర్తియని వర్ణించిరి.

కొన్ని దినములు చనిన వెనుక బౌద్ధగురుడు తనకు జరిగిన యవమానమును సహింపలేక మల్లికార్జున దీపమాలె గంబమును యెల్లవారు చూడ తన శిష్యునిచే పగులగొట్టించి తెప్పించెను. అట్టి పాపము చేసిన వానిని చంపక విడవరాదని రేమయ దేవయలను నిద్దరు నొకనాటి వేకువజామున సరసర లింగావసరములు చెల్లించి హరుప్రసాదంబు భోగించి జను లెర్గకుండ సమీప సముద్రాంతరస్థలి నున్న లంకయందు గల బౌద్ధాలయమును ప్రవేశించి దీపమాలెకంబము పగుల గొట్టినట్లు బౌద్ధగురుని దేహము కడికండలు చేసి, తలత్రెవ్వి పొట్టలో బెట్టి,యాతని దేహముపై నిది యసంఖ్యాతమహేశ్వరుల పంపనుచు నొక లేఖను రొమ్ముపై బెట్టి యవతలి దిక్కు రేవున యదృశ్యమైరి.

## పండితుని శాపము : వెలనాటి క్షయము

ఈవార్త విన్న చోడుడు పండితుని కక్షిదండన విధించెను. పండితుడు లింగోద్భవదేవునికి నమస్కరించి 'లింగోద్భవగద్య' చదివెను. పండితుడే తన కండ్లను రెండుసార్లు నూడబీకుకొనగా తిరిగి కండ్లు వచ్చెను. చోడ డిది యవమానమని తలచి మూడవసారి దృష్టి రాకుండ పండితుని యామికులచే నేత్రము లుప్పించి జీడిపాలు పోయించి వెడలిపోయెను. అమరారామమున తనకు తిరిగి దృష్టి దెప్పించి బౌద్ధవితతి పొగడునట్లుగా నుండ జేయుమని పండితుడు శివుని ప్రార్థించెను. తానిక చందవోలున నుండజాలనని మహేశ్వర క్రోధోత్కటానల పటల విరచిత జ్వాలల వెలనాటి చోడ ధరణీతలేశ్వరాధమ పతంగము భస్మమయ్యెడు గాక యని శాపంబిచ్చి యమరావతికి బయనమయ్యెను. వెలనాడున మహోత్పాతములు పుట్టెను, చోడుని యుదరంబు వ్రణబాధ మిక్కుట మయ్యె. అమరావతి దిక్కున పోవుచున్న పండిత కుటుంబమును, శిష్యులను దర్శించి చోడని భటులు పశ్చాత్తాపమును

దెలిపిరి. తన రాజ్య మిత్తునని చోడడు చెప్పె ననిరి. కాని పండితుని దయకు వారు పాత్రులు కాలేక వెడలిపోయిరి. చోడుడు మరణించెను. అతని సంతానమెల్ల రాజ్యార్థమై పోరాడుకొని చచ్చిరి. వెలినాడు పాడయ్యెను. పండితుడు దోవలో గణసహస్రనామావళిని పఠించెను. అమరావతి చేరి అమరేశ్వరునిపై యష్టకమును జెప్పెను. అక్కడ దీర్ఘికా మధ్యమున సభదీర్చి వెలనాటిసీమను దాటివచ్చినట్లు తనభక్తులకు చెప్పెను. చోడుడు మరణించెనను వార్త దెలియగానే తనకు ఊర్ధ్వనేత్రలాభము గలిగెను.

అమరారామమున భక్తానీక మంకనలు చేయుచుండగా మల్లికార్జునుడు సుఖలీల నున్నాడు. భక్తగణములకు వస్త్ర భూషణావలులు సమర్పించి విభూతివీడియంబు లొసంగినాడు. ఆనంద గీతములు, శంకర గీతములను బాడుచు హరగణంబు పరమశివానందభరితమై యున్న సమయమున కర్ణాటభాషలో కవిత్వము చెప్పుశక్తి కావలెనని పండితుడు అంతకు ముందెన్నడో పంపిన జంగమము వచ్చి బసవన్న పరమహత్త్వంబు ప్రస్తుతింపుచు బసవన్న హస్తానుగతభూతిని అందివ్వగా సాంగముగా కర్ణాటభాషలో కర్ణాటగీత సంగతులు బాడుచు బసవన్నను పండితుడు సాక్షాన్మహోక్షు, శిక్షిత ప్రతిపక్షు,బసవగణాధ్యక్షు నక్షణమ వీక్షించెదనని కల్యాణపురంబున కభిగమనంబు చేసెను. దారిలో నూరూర సద్భక్తు లెదుర్కొని పాదాభివందనంబు లర్పించిరి. నిడుగుడముల కేతించి సారంగేశుని త్రికాలము పూజించు వాడును, సతత జంగమ పరిచర్యానురక్తుడును, అవధూత, పూర్వవర్ణాశ్రమవ్యక్తి, శ్రుతిచోదితాచార సుపథ ప్రయుక్తుడును పండితుని అగ్రశిష్యుడు దోనయ్య కగ్రజుడు నగు వీరచాకి రాజయ్యచే భక్తిభావన పండితుడు ప్రణిపత్తి గొనెను.

నిడుగుడముల నుండి పండితుడు పానుగంటికి బయలుదేరెను. అచ్చట శిష్యుడు బండరువు గోవిందప్రెగ్గడ ఈ వార్త విని పుర మభిరామముగా నలంకరింప జేసెను. పండితుడు పురప్రవేశము చేయగనే సాష్టాంగుడై మ్రొక్కెను. ముంగట గురుమూర్తి నడవగా నాయన వెంట శిష్యుడు గోవిందప్రెగ్గడ పండితుని ఛాయద్రొక్కక, ఆయన త్రొక్కిన చోటు త్రొక్కక ప్రీతితో స్వగృహమునకు గొనిపోయెను. పండితునకు తన యింటనున్న సకల ధనకనకచీని చీనాంబర వస్తుసందోహమును గురుదీక్షగా నొసగెను. భక్తవరులు, పండితయ్యయు భక్తిసుధా రసాపార వనధి నోలలాడిరి.

## పండితుని శాపము : పానుగల్లు నాశనము

ఆ యూరి యేలిక ఉదయావనీశ్వరుడు. అతని పెద్దలెంక ధవళేశు నామయ్యా పాను సహజలింగ నిష్ఠావృత్తిలో నడచుకొనుచుండెను. తోడిలెంకలు రాజు కడకేగి నామయ్యపై కొండెము లాడజొచ్చిరి. రాజు తమ్మ పెట్టించుకొని తాను భక్తుండనని పారవేయుననియు, పిలచిన రాడనియు, నిన్నటి నుండి రేయును పగలు పండితుని యొద్ద, భక్తుల యొద్ద కూర్చుండు ననియు, రాజును లెక్క సేయడనియు జెప్పిరి. అంత నా రాజు నామయ్యను రప్పించి తన తమ్మ యొసగగా నా తమ్మను భూమీశు కడనే పారవైచెను. నామయ్య రాజసేవా వృత్తిని నిరసింప ఉదయావనీశుడు "మీబసవరాజాదిగా సేవాక్రమమున నడచినవారె. వారి కంటె యేవిధముగా భక్తుడవు? మొదటిసారికి తప్పుపట్టను గాని ఇదిగొ తమ్మ. తీసుకో లేనియెడల మా యొడలు మాకిమ్మ'నెను.

అంత నామయ్య "నన్నంటివిగాక! అన్యశరణులను, భక్తగణనాథులను గూర్చి పల్కుటయేల? ఇష్టలింగ ప్రసాదేచ్ఛానుభవులు కష్టమానవుల యుచ్ఛిష్టములను తిందురా, బసవయ్య భవుని (బిజ్జలుని) కొలవలేదా యని గదా ప్రశ్న. బసవయ్య మహిమ నీకు చక్కగా తెలియదు. పరమేశ్వరుడు బసవని సద్భక్తి వర్ధనార్థము భూమికి పంపినాడు. కంటకాసురుడనగా నొక్కదివిజకంటకుని బ్రతిపక్షుగా బంప పుడమిపై బిజ్జలుని సృజించినాడు. అతడు బల్లహపట్టభద్రుడు. ఆ బిజ్జలుడు కప్పడి సంగమేశ్వరమున కేగి బసవన్న దోడ్తెచ్చి బంఢరువిచ్చి సకలనియోగాధ్యక్షునిగా జేసినాడు. కాని యాతడు బిజ్జలుని నరమాత్రునిగనే చూచెను. బసవనికి జంగముల యందుండు భక్తి బిజ్జలునియందు లేదు. మిండజంగములకైనను రాజు నెదుటనే ధనము ధారవోయును. ఎన్నిసారులు తప్పులు పట్టినను బసవడన్ని తూరులు బిజ్జలునకు ఒప్పు గావించి శివభక్తిమహాత్మ్యమును బ్రతిష్ఠించెను.

అల్లయ్య, మధుపయ్యలను శివభక్తులను బిజ్జలుడు చంపించగా బసవనమంత్రి కల్యాణము పాడుగావుత మని శపించెనని. జగదేక, మల్ల, బొమ్మయలు బిజ్జలుని హతమార్చిరని. కావున భక్తులు సేవకవృత్తి కొలిచిన కొలుతురు గాని సత్పథంబు విడవరని నామయ్య చెప్పి యుదయావనీశు చేనున్న చురియ చెచ్చెర పుచ్చుకొని యూరిలోని గోపురద్వారహర్మ్య మెక్కి ఉదయావనీశు వంశ మంతరించుగాక యని

శాపమిచ్చి తనకంత ముత్తరించు కొనెను.

అది వినిన పండితుడు కోపోద్రిక్తుడై "ఉదయాభిధానావనీవల్లభశ్చ సపుత్ర కళత్రమిత్ర బాంధవో వినశ్యంతి క్షిప్రం పరం విదూషకో" యని శాపజలంబు లెత్తి చల్లె. ఈపానుగంటి నుండంగ గాదనుచు పండితుడు పురి వెడలంగ వెనుక నక్కజముగా గల్పొన్న పూచె, కల్కోడి కూసె, పానుగంట నుత్పాతములు పుట్టె, ఉదయావనీశుడు సబాంధవముగా నశించెను.

## బసవన మరణవార్త : వనిపురము

పానుగంటి నుండి పండితుడు వనిపురమునకు వచ్చెను. అచ్చట శంకరయ్య యను భక్తుడు భక్తసమేతుడై పండితు నెదుర్కొని ఊరిలోనికి గొనివచ్చెను. పండితు డక్కడ కొన్ని వాసరములు గడిపి కల్యాణమున కభిగమనంబుసేయ సిద్ధమై యుండగా అచ్చట భక్తి గజిబిజి పుట్టి జగదేవ మల్ల బొమ్మయలు బల్లహు బిజ్జలుని చంపిరని, బసవేశ్వరుడు కప్పడి సంగమేశ్వర గర్భములో దేహముతో చొచ్చెనని, నిది జరిగి యెనిమిది దినము లయినదని నొక యయ్య చెప్పగా పండితు డుల్కిపడి, దుఃఖించి

"నామాత నాభ్రాత ననుబెట్టి నీవు
గాయజసంహారు గర్భంబు సొచ్చి
తా యంచు"

బసవేశ్వరుని గూర్చి ప్రలాపించెను.

ఆనాడు లింగార్చనము చెల్లించి పండితయ్యయు, శంకరయ్యయు, సద్భక్తవరులు బసవదండాధీశు మహిమ గొనియాడుచు మహోద్భుతాక్రాంతాత్ములై యుండిరి.

## లింగైక్యము వెల్లటూరు

వనిపురము నుండి శంకరయ్యగారిని వీడ్కొని పండితారాధ్యుడు శ్రీశైల ప్రాంతమువైపుకి మరలెను. సమీపమున కేగు తరి నైష్ఠిక శైవపాశుపతులు వీరమాహేశ్వరులు కనబడిరి. శ్రీశైలము త్రింశద్యోజన భూమి. కొన్నిదినములు ప్రయాణము చేసి చేసి వెల్లటూరున కొచ్చెను. ఆయనకు శ్రీశైలమంతయు దివ్యలింగ స్వరూపమై వెలింగె. దానినే శ్రీ లింగమూర్తి సాక్షాత్కారముగా తలంచి పండితుడు లింగావసరమును చెల్లించె.

## పండితుడు - శివైక్యము

అంత తనశిష్యుడు దోనయ్యను బిలిచి శ్రీగిరినాథుని పోయి సేవింపుమని, శివరాత్రి యచ్చటనే చెల్లింపుమని పర్వతమును చుట్టి ప్రదక్షిణము కావించి తన వ్రతసమాప్తిని కావింపుమని యాజ్ఞ యిచ్చెను. శిష్యుని కోరికపై శ్రీశైల మాహాత్మ్యమును వినిపించెను. దోనయ్య సాష్టాంగపడి గురువు యాజ్ఞను శిరసావహించి శ్రీశైలమున కరిగెను. వృషభపురమున బసవేశ్వరుని యాలయమును దర్శించి యచ్చటనున్న చతుర్ముఖ బసవలింగంబునకు పూజ చేసెను. అచ్చట నుంచి బయలుదేరెను. దారిలో బసవపురాణ, పర్వతపురాణములు చదువువారిని చూసెను. చివరకు మల్లికార్జునపురము చేరెను. మల్లన్నను దర్శించి జంగమారాధనలు సల్పెను. శివరాత్రి జాగరణ మొనర్చెను. శ్రీశైలమల్లికార్జునుడే వృద్ధతపోధనుని లీల దోనయ్యను కలుసుకొని, తన పూర్వస్నేహితుడైన పండితయ్య యోగక్షేమము లడిగెను. ఆదట దోనయ్యను నొక దీపవృక్షముపై నెక్కించి శ్రీగిరి జూడ మనెను. ఆచెట్టుపై నుండి దోనయ్యకు బర్వతమంతయు గనిపించెను. వృద్ధమల్లయ్య తరువాత యదృశ్య మయ్యెను.

యాత్ర ముగించుకొని దోనయ్య శైలము దిగి వెల్లటూరునకు తిరిగి వచ్చెను. గురువునకు పాదాభివందన మొనర్చి జరిగిన విశేషము లన్నియు జెప్పెను. వృద్ధ మల్లికార్జునుడు తనను దలచినందుకు పండితయ్య పరమానంద మొందెను. తనను ప్రమథమండలిలో జేర్చుకొమ్మని వేడెను. పండితారాధ్యులవారు, నాత్మ సంతతితో కులసతీ సమేతముగా లింగోదరమున లీనమైరి.

సకలభువనపావనుని యపూర్వతనూజు కేదారయ్యకు లోకారాధ్యపట్టమును గట్టి దోనయ్య భక్తిరాజ్యము నేలుచుండెను. కేదారయ్యకు మనుమపండితుడు, భీమనపండితుడు, మహదేవయ్య, చెన్నవిభుడు అను నలుగురు పుత్రులు గలరు. ఇక శైవసంతానములో ఇవటూరి సోమనాథయ్య, వారి పుత్రులు సూరీశ్వరుడు, లోకారాధ్య విశ్వనాధప్పయ, సింగణమంచి కలరు. వారి నుండి గురుపరం పర తేజరిల్లె.

## పండితునిజీవితము: పున: పరిశీలన

పండితునిది దక్షారామము జన్మదేశమని ఇతః పూర్వ చరిత్రకారులు చెప్పినారు.కాని పండితుడు పుట్టినది శ్రీశైలమే.

దక్షారామభీమేశుని పురోహితశ్రేష్ఠుడైన భీమయపండితుడు శ్రీశైలమందు సంతానార్థమై పంచాక్షరీ పురశ్చరణ చేయుచున్న కాలమున నాతని భార్య గౌరాంబ గర్భమున శివుడు సృష్టించినమూర్తి యవతరించెను. భార్యాభర్త లిరువురును తీర్థయాత్రా స్థలమును నుండుటయే సనాతనధర్మము. కావున గౌరాంబగూడ తన భర్తసన్నిధిని శ్రీశైలములో నున్నది. ఆమె యచ్చటనే గర్భము ధరించి శిశువును కన్నది. మల్లికార్జున పూజాఫలమగుటచే నాతనికి 'మల్లికార్జున'యని పేరు పెట్టిరి. గౌరాంబా భీమయపండితు లేమైరో తెలియదు గాని కుమారుడు తండ్రిగ్రామము దక్షారామమునకు పండితమల్లికార్జున నామముతో తిరిగి వచ్చెను.

> *"....పండిత మల్లికార్జునుం డనఁగ*
> *నగణిత ప్రీతి దక్షారామమునకు*
> *జని"* (పం. చ. దీ. ప్ర. పుట. 29)

కోటిపల్లియారాధ్యుల వద్ద దీక్షను స్వీకరించెను.

శివతత్త్వసార కృతికర్తయగు మల్లికార్జునపండితుని తాను ప్రతిదినమును తలంచుకొనుచుండెడివాడనని పాల్కురికి సోమన అనుభవసారమున కీర్తించి యున్నాడు. ఈ కృతి త్రిపురాంతకమున వ్రాయబడినది. బసవపురాణము గూడ నచ్చటనే వెలసినది. బసవనకంటె సోమనకు పండితుని గూర్చియే బాగుగ తెలును. అనుభవసారమున పండితుని సోమన స్తుతించుటకు కారణము పండితుడు శ్రీశైలప్రాంతము వాడని యానాడు ప్రచారములో నుండి యుండును. మరియు సోమనాథుడు బెలిదేవి వేమనారాధ్యుల మనుమని శిష్యుడు, ఆ వేమనారాధ్యులు తెలంగాణము నుండి పోరండ్ల సూరసానమ్మతో దక్షారామమునకు వచ్చి పండితుని దర్శించెను. పోరండ్ల కరీంనగర్ తాలూకాలోని గ్రామము బెల్దేవి గ్రామము బలిగ్రామమై యుండెనా? అదియు తీరాంధ్రమునకు సంబంధించినది కాదు. వనిపురము వనపర్తి. (వని పట్లయని వేరొక వాదన) మహబూబు నగర్ జిల్లాలోని తాలూకా గ్రామము. వెల్గొండ మహదేవయ (పండితుని సమకాలికుడు)ది వెల్గొండ. ఆ గ్రామము, పండితుడు నిర్యాణ మొందిన వెల్లటూరును మహబూబ్‌నగర్ జిల్లా కొల్లాపురము తాలూకాలో 64, 74 గ్రామ సంఖ్యలలో నున్నవి. పాలకుర్తి సోమన

## తూర్పు గోదావరి

పద్మశివుడు: (బిక్కవోలు, రామచంద్రపురం తా.) సర్వలోకాశ్రయ మూడవ విష్ణువర్ధనమహారాజు తన 25వ రాజ్యపాలనా కాలమున (724-758) బిక్కవోలులోని బెజయీశ్వరమహాదేవునికి కొంతభూమిని దానము చేసెను. ఆ దానమును పద్మశివుడు బిక్షావృత్తిగా గొనెను. (12/1920-30). పశ్చిమ గోదావరి వసంతవాడలోని తేరంబి మఠగురువులు వామశివ, పురుషశివులు ఈ కాలమువారగుటచే పద్మశివుడును తేరంబి మఠమునకు చెందినవాడై యుండును.

## పశ్చిమ గోదావరి

వామశివ, పురుషశివ. క్రీ.శ. 724-758 (వసంతవాడ, ఏలూరు తా.) వసంతవాడలోని శివాలయమునకు స్థానాపతులు. తేరంబి నివాసియైన బ్రహ్మశివాచార్యుని శిష్యులు. ఈ దానము శాసనములో నిట్లు చెప్పబడినది:

*తేఱంబి నివాసి బ్రహ్మశివాచార్యాన్తేవాసి వామశివ పురుషశివాభ్యా మారాధనీయానాం త్రయాణాం దేవస్థానానాం నిత్యపూజా బలి ప్రదానార్థం దత్తం ఘన సుషిరా వనద్ధ వాద్య వాదక గాయక నటకాచార్య విలాసినీ జనభృతయే యేతద్దేవాయతన ఖండస్ఫుటిత నవ కర్మాది కార్యకరణార్థంచ॥*

(సోమశేఖరశర్మ - 305)

### తడికలపూడి

తడికలపూడి (ఏలూరు తా.) క్రీ.శ. 1216లో సుబ్రహ్మణ్యశివాచారి (రాచగురుదేవర శిష్యుడు) (SII V. 197) క్రీ.శ. 1243లో సిద్ధాంతశివాచారి శిష్యుడు అనుగ్రహ శివాచారి (SII V. 206). 1275లో గోళగిస్థానపతులు ఉత్తమశివులు (SII V. 199) పేర్కొనబడినారు. భట్టిప్రోలు (రేపల్లె తా. గుంటూరు జి.) లోని ఉత్తమశివుడు నీతడు ఒకే వ్యక్తియా? పై గురువులలో అనుగ్రహశివాచారి "యమనియమ ధ్యాన ధారణ మౌనానుష్ఠాన జపహోమ సమాధి స్వాధ్యాయ నైష్ఠిక తపోభూయిష్ఠ సిద్ధాంత శివాచార్య" పుత్రుడు.

సుబ్రహ్మణ్యశివాచారి, సిద్ధాంతశివాచారి, అనుగ్రహశివాచారి, ఉత్తమశివుడు ఈ వూరనున్న మఠాచార్యులు.

## కృష్ణా జిల్లా :

సోమశివాచార్యుడు (పెదకళ్లేపల్లి, దివి. తా.). క్రీ.శ. 1292 "పుష్పగిరి మఠ సాంతానికులైన శ్రీమతు సోమశివాచార్యులు జనమేజయ సర్పయాగస్థానమునందు ఊగుడి" (126, 126A/1897. SII VI 81, 82)

## నెల్లూరు

శాంతశివగురు (గంగాపురం. దర్శి) క్రీ.శ. 1254. త్రిపురాంతకదేవుని స్థానాపతి రాజగురుదేవుని శిష్యుడు (V R Darsi 85, 86)

## కడప

ఉత్తమశివ (తుడూరు. సిద్ధవటం తా. ) క్రీ.శ. 1077 లోని బిజ్జాపుర గ్రామమును తెనుగుచోడబిజ్జన[2] తన గురువైన ఉత్తమశివునకు దానము (62/1939-40)

పుష్పగిరి: కడప తా. ఈశానగురుదేవ : క్రీ.శ. 1257లో కాకతి గణపతిదేవుని రాజ్యకాలమున గంగయ యను నాతడు పుష్పేశ్వరస్వామికి ఈశానగురుదేవుని ద్వార గంగవరమను గ్రామము. (23/1937-38). పెదకళ్లేపల్లి (కృష్ణాజిల్లా) లోని సోమశివాచార్యులు ఈ మఠమునకు చెందినవాడే. ఇచ్చట గోళగిమఠ మున్నట్లు నిదర్శనముగా ఇంద్రనాథస్వామిదేవాలయ ప్రాకారకుడ్యమునం దొకచోట తమిళభాషలో గోళగిమఠము ప్రసక్తమైనది. (78/1965 APGRE)

వ్యాపకశివ : (క్రీ.శ. 1237) (అదేవూరు, తా.) యజ్ఞజియ్యర్ శిష్యుడు (6/19535, 19/1953-54).

## కర్నూలు

శాంతశివ (క్రీ.శ. 1260) (శ్రీశైలం, కర్నూలు జి. నందికొట్కూర్ తా.) శ్రీపర్వతములోని అభినవ గోళగిమఠాధ్యక్షుడు, శివలింగమఠానికి, విద్యామంటపానికి చెందిన బ్రాహ్మణులకు, దేశాంతరులకు కాయస్థ జన్నిగదేవుడు కల్పించినది. (50÷ /1941-42)

ఈశ్వరశివాచార్యులు : క్రీ.శ. 1313. శ్రీశైలం. అరసు మఠము.

## అనంతపురం

వరుణశివ భటారకుడు : గౌని మోర్చుగల్లు (మడకశిర, తా.) క్రీ.శ. 936 నోలంబ

పల్లవుని అన్నయదేవుని కాలమున వోలంబేశ్వరదస్థానాపతి. "జపనియమ తపోవాస సత్యశౌచాచారాన్వితత్తపోవనానురాగ.. శివసత్రాసురంజిత భగవద్వాదైకాభరణ" (SII.IX -24)

ఈశానశివుడు : హేమావతి (మడకశిర. తా.) క్రీ.శ. 12 వ శతాబ్ది. శ్రీనగరిలోని మంగీశ్వరదేవుని స్థానాపతి (EI XXX. p. 269-276).

అనంతశివుడు (అదే ఊరు) క్రీ.శ. 10 వ శతాబ్ది. నకరేశ్వర దేవాలయ స్థానాపతి. (12/1917)

రుద్రశివ (సంగమేశ్వరం. రాయదుర్గం తా. ) క్రీ.శ. 1073. కూడలి సంగమేశ్వర దేవాలయ స్థానాపతి. (SII IX. 138)

## మహబూబ్ నగర్

శంకరశివాచారి (కాకతి ప్రతాపరుద్రుని కాలము. సోమశిల, (కొల్లాపురం తా.) ఇతనికి రాచగురుదేవు డని బిరుదము. (No. 255/APGRE 1966)

## నల్గొండ

ముగ్ధశివాచారి (1019-20). (ఏలేశ్వరము, దేవరకొండ తా) ఇతడు సద్యశ్శివాచారి శిష్యుడు. ఈగురువు సదాశాకాహరి. వేములవాడ ప్రథమ అరికేసరి విద్యాదాన నిమిత్తము కొల్లిపఱ్ఱు (గుం. జి.)లో కొంత భూమిని ముగ్ధశివాచారికి దానము చేసియున్నాడు. (భారతి 1930 ఆగస్టు))

శాంతశివదేశికులు (క్రీ.శ. 1267). (అదే తా.) యాదవ విశ్వనాథుని కీతడు రాజగురువు.

## కరీంనగర్

ధర్మశివాచార్యుడు : (కాళేశ్వరము. మంతెన వా.) అర్కియాలజీ డిపార్టుమెంటు వారు "Visweswara Sivacharya and his son Dharma Sivacharya" అని పొరబాటుగా వ్రాసియున్నారు. ధర్మశివుని శిష్యుడు విశ్వేశ్వరశివాచారి కదా! ఇది గణపతి దేవుని కాలము. ధర్మశివుడు తనగురువు విమలశివుని పేర నొక దేవాలయమును (..చ్ఛైలాయతనం) నిర్మించినాడు. గురువులు తనువు చాలించిన పిమ్మట శిష్యులు వారి పేర నొక లింగమును ప్రతిష్ఠించి గుడికట్టించుట కలదు. దానికి 'గుర్వాయతనం' అని పేరు

ఆయతనమ్ -

"గ్రామేణా యది వారణ్యే
పుణ్యాస్థానం హి శూలినః
ఆదాసో ధర్మతృప్తానాం
సిద్ధిక్షేత్రం హి తత్పరమ్"

కౌండిన్యుని పాశుపత సూత్ర వ్యాఖ్య 1-8

క్రీ.శ. 390లో గుప్తరాజులకాలమునాడు లకులీశ్వర మాహేశ్వరుడైన ఆర్య ఉదితాచార్యుడు ఉత్తర హిందూ స్థానమున మధురాపట్టణములో రంగేశ్వరు మహాదేవునకు సమీపమున పాతనూతి గోడకు పాతిబెట్టబడిన శాసనములో తన గురువు కపిలీంద్రముని పరమగురువు ఉతమితేశ్వరుని ప్రతిమలలో కూడిన లింగములను ప్రతిషించినట్లు తెలిపినాడు. శాసనమున దీనిని 'గుర్వాయితనమ్' అని పేర్కొనినాడు. భాసుడు ప్రతిమానాటకమున అజ, దశరథమహారాజుల ప్రతిమలను భరతుడు చూసి తండ్రి దివికేగినట్లు గ్రహించి దుఃఖితుడైనాడుగదా! విమలశివాచార్యుడు తన గురువు కీర్తిశంభుని పేర కీర్తీశ్వరదేవాలయమును నిర్మించినాడు. ( CII జబల్‌పూరి. నెం. 64.) ప్రస్తుత కాళేశ్వరశాసనములో "సశ్రీ ధర్మశివో (న్) గణపతే ర్దేవస్యరా (జ్ఞో) ( ) రుః" అని ధర్మశివుడు గణపతి దేవునికి గురువని స్పష్టముగా నున్నది. ఈ శాసనకాలము తెలియదు (కరీంనగర్. 32.)

విశ్వేశ్వరశివాచార్యులు : గణపతిదేవుని రాజ్యపాలనకాలము. (కమ్మంపల్లి. మంథెన. తా.) శ్రీకాకతీయ గణపతిదేవమహారాజులు రాజ్యంబు సేయుచుండంగా శ్రీమతు రాజగురుదేవరైన శ్రీ విశ్వేశ్వరశివాచార్యులు చంద్రవెల్లి, కమ్మముపల్లి... విశ్వేశ్వర దేవాయతనము అంగరంగభోగాలకు దానము చేసినట్లున్నది. (కరీంనగర్. నెం. 34), కాలము తెలియదు. అయినను మాల్కాపుర శాసనములో(1261)

"మంద్రకూటాభిధానే...

నామ్నా స్వేనస చంద్రవల్లి నగరే లింగ ప్రతిష్ఠాప్య" అని యుండుటచే నిచ్చట గోళగిమఠ ముండెడిదని వేరె చెప్ప నవసరము లేదు.

ఇవి గాక మా. శా. కాళేశ్వరములో నొక మఠము నందపదము (మునికూటపురము మునిగోడు), ఏలేశ్వరములో నొక మఠము, నందికొట్క్యూరు తా. ఇల్లాల, దుద్యాలల

(ప్రస్తుతం ఆత్మకూరు. కర్నూల్ జి)లో మఠములను స్థాపించినట్లు చెప్పుచున్నది.

## వరంగల్లు

ధర్మశివాచార్యుడు : (క్రీ.శ. 1245. శంభుని గుడి) విమల శివాచార్యుని శిష్యుడు. (వరంగల్లు. నెం. 65)

విశ్వేశ్వర శివాచార్యులు : (ప్రతాపరుద్రుని కాలము. ఉరుసు వరంగల్లు తా. నెం. 99)

వరంగల్లునకు రెండుమైళ్ల దూరములో నొక గుట్టమీద చెక్కిన కావ్య శాసనములో-

*"ఇతి రాజగురు విశ్వేశ్వరపండిత సూనోర్న*
*రసింహార్షే కృతౌయోగ... తే ప్రధమ సర్గః"*

బహుశ : శాసనలుప్తభాగములో 'కాకతీయ చరితే' యని యుండదగు. ఈ నరసింహకవి వరంగల్లు 96వ. శాసనములో కాకతీయచరితము వ్రాసినట్లు చెప్పుకొని యున్నాడు. ఇతడు దశరూపకములకు వ్యాఖ్య, మళయవతియను గద్య కావ్యము రచించెనట. (వరంగల్లు 97) ఉరుసుగుట్ట పైన సిద్ధోద్వాహం అను కావ్యము చెక్కబడినది. 155 పంక్తులు గల ఆకావ్యము చివర "విశ్వేశ్వర సూనోర్నరసింహార్షే కృతిం:" అని యున్నది[3] సూను డనగా శిష్యు డనియే అర్థము.

అఘోరశివాచార్యులు :(క్రీ.శ. 1313. వరంగల్లుకోట నెం. 89). సహస్రలింగ గణపతీశ్వరదేవ స్థానాపతి, రాచగురుదేవర మఠము పేర్కొనబడినది.

సోమనాథుడు పేర్కొనిన "శ్రీ కంఠశివులు" మొదలయిన వారు మధ్య ప్రదేశ్ నుండియు, పశ్చిమబెంగాలు నుండియు వచ్చిన గోళగిమఠగురువులని స్పష్టపడుతున్నది.

## బిజ్జలుడు - శైవమత పరిస్థితులు

బసవపురాణమునగాని తదిత రాంధ్రగ్రంథము లందు గాని గోళగిమఠప్రసక్తి కానరాదు. కర్ణాటకమున కాలముఖమఠముల కున్న ప్రఖ్యాతి తెలుగుదేశమున లేదు. ఇక తమిళనాడులో రాజరాజచోళుని కాలమునుండియు గోళగి మఠగురువులు (లక్షాధ్యాయ, భిక్షాధ్యాయి) రాజగురువులై వర్ధిల్లిరి, వారిలో చాలమంది పశ్చిమ బెంగాల్‌లోని దక్షిణ రాఢామండలమునుండి వచ్చినవారే. తమిళనాడు గోళగిమఠము

ఆంధ్రదేశములో 'గోళగి' మఠము వెలువడుటకు ముందుగా (అనగా 200 సంవత్సరములకు) వెలసినది. తెలుగుదేశమున గోళగిమఠ ప్రవేశము చోళచాళుక్య సమ్మేళన ఫలితముగా నేర్పడి యుండవచ్చును. తూర్పుచాళుక్యులు తమిళచోళులు సఖ్య సంబంధము కలవారని చరిత్ర చాటుచునే యున్నది. కర్ణాటకమున బిజ్జలుని కాలమున (1156-67) కాలాముఖుల వైభవ ప్రాభవములు శాసనములలో మిక్కిలిగా కొనియాడబడినవి. బిజ్జలుని కల్యాణమున గోళగిమఠగురువు లున్నట్లు తెలియువచ్చుటలేదు. అయినచో శ్రీకంఠశివులు మొదలయినవారు కల్యాణమున నున్నట్లును, వారి బసవేశుభక్తులతో తాము లింగవంతుల మనుచు ప్రసాదమును గుడుచుచున్నారని బోయలు బిజ్జలునితో మొరబెట్టుకొనిరనియు సోమనాథు డెట్లు చెప్పగలిగెనో దురూహ్యముగా నున్నది. అటులే బిజ్జలుని కాలమున కర్ణాటకములో బసవేశ్వరు డను వీరశైవమత మహావిప్లవకర్ణధారు డుద్భవించి, కలచురి బిజ్జలుని కోశాధికారై, మంత్రియై, దండనాథుడై రాజబొక్కసమునుండి ధనరాసులను భక్తివర్ధనము కొరకు జంగమములకు పంచిపెట్టించి, తుదకు కల్యాణమున గజిబిజి యొనర్చిన మహావీరుని పేరు బిజ్జలుని శాసనములందుగాని, అతని తనయుడు సోయిదేవుని శాసనము లందుగాని లేకపోవుట అద్భుతాశ్చర్యానుమాన సంజనితముగా నున్నది. పలువురు చారిత్రకులును నిట్లే తలచిరి. (చూ. అబ్లూర్ శాసనములు. E.I.V: 2244-5 J.F. Fleet దొరవారి అభిప్రాయము.) మరియు Lorenzen అభిప్రాయమును గూడ తిలకింపుడు.

"Not only is there no epigraphic evidence of the existence of Veerasaivas before Basava but the epigraphic allusions to Virasaiva activity in the two or three centuries after Bijjala one few and far between. (Lorenzen - 167).

దీని యథార్థ కథన మిట్లూహింపవచ్చును:

11వ శతాబ్ది నుండి 1167 వరకు (బిజ్జలుని కాలావసానము) కాలముఖ మఠములు కర్ణాటకమున లకులీశపాశుపతమును బ్రహ్మాండముగా ప్రచారమొనర్చినవి. ఆ మతమున బ్రాహ్మణాధిక్యము మెండు. వారిలో చాలా మంది ఔత్తరాహులు. వారికి సంస్కృతమే ప్రచారసాధనమై యుండనోపు. వారు కర్ణాటకులు కారు. వారి మాతృభాష కన్నడమును కాదు. ఇది ఒక కారణము.

వేరొక కారణము జైనమతప్రభావము. కాలాముఖ, వీరశైవ మతములకు

ముందుగనే జైనమతము కర్ణాటకమున వ్రేళ్లుదన్నుకొని యున్నది. జైనము వేదవిరుద్ధమే గాక శైవమునకు ప్రత్యక్షవిరుద్ధము. దక్షిణాది శైవసమయాచార్యుల జీవిత మంతయు, మతప్రచారముకంటె, జైనబసది నిర్మూలనమునందె గడచినది. కాలాముఖ మఠములలో సర్వదర్శనములు విద్యాప్రణాళిక యందున్నవి. వారు వీరశైవులవలె జైనులను తొడలు సరచి కయ్యమునకు పిలిచినవారు కారు. శైవములో జైనసమయనిర్మూలనమే వీరప్రధానమైనది. కనుకనే అట్టివారు వీరశైవులైరి.

*ఏక ఏవాయ మస్మిన్ హి సర్వే స్మిన్ జగతీతలే*
*విశేష ఈరతేయస్మాద్వీర ఇత్యభిధీయతే॥*
*శివేన సహసంబంధం శైవ మిత్యుదితం బుధైః*
*ఉభయో స్సంపుటీభావాద్వీరశైవ మితి స్మృతమ్॥*
*శివార్థార్పిత జీవత్వా ద్వీరతంత్ర సముద్భవాత్*
*వీరశైవ సమాయోగా ద్వీరశైవ మితి స్మృతమ్॥*

-వాతూలాగమము

శ్రీ వీరశైవ సిద్ధాంతశిఖామణి - డాక్టర్. కె.యమ్. రుద్రప్ప (హైదరాబాదు)

చారిత్రకముగా తెలిసినంతవరకు ఏకాంతరామయ్య ప్రథమ వీరశైవుడు. (1200) (E.I.V. 237) ఏకాంతరామయ్య అబ్బలూరిలో జైనవాదములో జయపత్రమును బిజ్జలునివద్ద నుండి బసవన సమక్షమున పొందినప్పటినుండియు నా దేవాలయము బసవేశ్వరాలయముగా, వీరశైవులకు ప్రధానక్షేత్రముగా మారినది. ఒకటేమిటి కాలముఖ ప్రధానమఠమైన కేదారమఠముగూడ నేడు వీరశైవులకు పవిత్రక్షేత్ర మైనది. ఇట్టి పరివర్తన కాలమును శైవమతచరిత్రకారులు గుర్తింపకపోవుట వింతగానున్నది. కాని నందిమఠ్‌గారు మాత్రము నిష్పాక్షికమైన తమ యభిప్రాయమును నిట్లు వెల్లడించినారు:

"Slowly and imperfectly they (Kalamukhas) were absorbed into Virasaivisam" (Nandimath page 99)

తిరిగి మన సోమనాథుని కథనమునకు వత్తము. ధర్మశివులును విద్యాధరశివులు నిర్మలశివులును నిష్కలశివులు మొదలుగాఁ గల శైవముఖ్యు లందఱును

*"నిది యేమి మతములో యెఱుఁగంగరాదు*
*బసవయ్య తోయంపు భక్తులఁ జూచి*

వసుధదారును లింగవంతుల మనుచు
*దొడఁగి ప్రసాదంబును గుడుచుచున్నారు"* (బ. పు. సప్తమాశ్వాసము). అనగా ఆకాలమునాటి కాలాముఖ పాశుపతశాసనధరులు గూడ వీరశైవులతో కలిసిపోయి రన్నమాట. సారాంశ మేమనగా క్రీ.శ. 1200 నాటికి కర్ణాటకమున వీరశైవ మొక నూతనమతముగా నేర్పడినది.

## తెలుగుదేశము - వీరశైవము

తెలుగుదేశమున వీరశైవమతమునకు లేదా వీరమాహేశ్వర సిద్ధాంతమునకు మందుగా పాశుపతమే వర్ధిల్లినది. విష్ణుకుండినులు (408-617) శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతులు. తూర్పు చాళుక్యులలో కొందరు జైనమతమునెడ కొంత కొంత అభిమానమును చూపినను వారు ప్రధానముగా శైవులే. నరేంద్రమృగరాజాపర నామధేయుడు, ద్వితీయవిజయాదిత్యుడు అయిన తూర్పు చాళుక్యరాజు (808-847) 108 శివాలయములను శాత్రవ శిరః కంఠములచే రక్తదిగ్ధమైన ప్రదేశములందు నెలకొల్పెనట. ఈ దేవాలయములే సమస్త భువనాశ్రయ శ్రీ నగేంద్రస్వామి యను పేరుతో వెలయుచుండెను. నరేంద్రమృగరాజు కాలములో ప్రథమ పాశుపత్యాచార్యు డుండెను. ద్వితీయ అమ్మరాజు (945-970) తాడికొండ శాసనమున అమరవాటీ (అమరావతి) దేవాలయతన సమస్తభువనాశ్రయములో పాశుపతులు సన్మానింపబడిరి. కలివిష్ణువర్ధనుని (852-53) కాలమున అమృతసోమాచార్యుని శిష్యుడైన పశుపతి భగత్పాదునకు కొంత భూదానము జరిగినది. అమృతసోమ శివాచార్యుడు బాలసోమ భగవంతుని శిష్యుడు. (EI XXXVII. 41.44) వేములవాడ చాళుక్యులు శైవులు. నన్నయ మహాభారతకృతిశ్రోత రాజరాజు (1019-68) ఈశ్వరాగమములయందు భక్తి నిలిపినవాడు. తాతగారైన రాజరాజ చోళుడు, తన మామగారైన ప్రథమ రాజేంద్రచోళుడు, గోళగిమఠాచార్యు లయిన సర్వశివ ఈశానశివుల శిష్యులు. కావుననే రాజరాజునకు పార్వతీపతి పదాబ్జధ్యానము కరం బిష్టమై యుండు. రాజరాజు తరువాత చాళుక్యచోళులను గూర్చి వేరె చెప్పనవసరములేదు.

## మల్లికార్జునపండితుడు

మల్లికార్జునపండితారాధ్యుని గురువునకు (కోటిఫలి ఆరాధ్యుడు) గురువు

అవాంతరయ్యా శాంభవదీక్షాభిజాతానువర్తి యమనియమాది వ్రతాచార సారశమదమోత్కృష్ట నిష్ఠాగరిష్ఠుడు; చతుర్వేదార్థ వేత్త. గురువు కోటిఫలి ఆరాధ్యుడు న్యాయ వైశేషికోదాత్త శాస్త్రానపాయ దర్శన పరిపాలనక్షముఁడు. అనగా పాశుపతమునకు చెందినవాడు. (చూ. హరిభద్రసూరి షడ్దర్శన సముచ్చయము). ఇక మల్లికార్జున పండితారాధ్యుడు పశు పాశ పతిజ్ఞాన దృష్టి పడసినవాడు.

*"స్థిర పశు పాశ పతిజ్ఞాన ముఖ్య*
*సరణియె భవవార్ధిఁ దరియించు తెప్ప"*

(పం.చ.వాద. ప్ర. పు 555)

యని వెలనాటిచోడుని యాస్థానమున పరవాదులను గీటడంచి, పాశుపత దర్శనమును సుప్రతిష్ఠించినాడు. లభించినంతవరకు శివతత్త్వసారమున[4] వీరశైవమను మాటయే లేదు. అందున్నది పశుపాశపతిజ్ఞానము. చారిత్రకముగా నీతడు బసవనికి సమకాలికుడు.

*"జనని పైని ప్రేమ జనయిత్రిపై భక్తి*
*వదలలేని బాల పగిది నేను*
*భక్తి మీది వలపు బ్రహ్మంబుతో పొత్తు*
*బాయ జాల నేను బసవలింగ"*

యని బసవేశ్వరునికి కబు రంపినాడని కిం వదంతి. కాని పై పద్యమకుటము సోమనాథుని బసవలింగశతకము (చతుర్వేదసారము) లోనిది. (చతుర్వేదసార ముద్రితప్రతి యందనేక పద్యములు చేర వలసియున్నవి.)

## శ్రీపతిపండితుడు :

శ్రీపతిపండితుడు శ్రీకరభాష్యరచయిత కాడని చెప్పుటకే ఎక్కువ ఆధారములున్నవి. శ్రీకరభాష్యములో "వీరశైవ" మను పదమున్నది.[5] అది శ్రీకర భాష్యము ప్రాచీన మనువారి వాదమునకు కుద్దాలప్రాయమైనది.

## నన్నెచోడుడు :

నన్నెచోడుని కుమారసంభవకృతిపతి జంగమమల్లికార్జునుడు కాలాముఖశైవుడు కాని వీరశైవుడు కాడు. ఏతత్ కృతియందు వీరశైవపదమే కన్పట్టదు. "కృతిపతి

మల్లికార్జునుడు కాలాముఖమతస్థాపకుఁడె యని నా యభిప్రాయము" అని మానవల్లి రామకృష్ణకవిగారును (కు. సం. ద్వి.భా. పీఠిక 33). "నన్నిచోడని గురువయిన మల్లికార్జునుఁడు కాలాముఖమతమువాఁడు" అని వేటూరి ప్రభాకరశాస్త్రులగారు, (బ.పూ. పీ. 74), కోరాడ రామకృష్ణయ్యగా రీయభిప్రాయములను సమర్థించిరి. (కు. సం. మ. వి. పీఠిక XII, XIII). ఈ యభిప్రాయములే చారిత్రకముగా సమంజస మగును. జంగమ పదమును కర్ణాటక కాలాముఖ శైవులలో కొందరు వాడియున్నారు. (EI VI. 96-97, JBBRAS X 167-298 No. VII)

కుమారసంభవకృతిపతి గురువు శ్రీశైలమఠమునకు చెందిన కాలాముఖ శివయోగి. ఆతడా ప్రాంతీయుడు. అతడే పెదచెఱకూరి శాసనముతో ముడిపడ్డ కొప్పరము శాసనములోని కాలాముఖ మల్లికార్జునుడు. సంచారార్థము నక్కడికి వచ్చియుండ వచ్చును. అనంతపురం జిల్లా గుత్తిలో త్రిభువన మల్లదేవుని కాలమున దండనాయకుడు ఓమియరసు 'యమనియమ స్వాధ్యాయ ధారణ మౌనాను ష్ఠాన జపసమాధి సంపన్న రప్ప శ్రీమతు కాలాముఖ మల్లికార్జున పండితర్గే' యని తన శాసనములో పేర్కొనినాడు. దీనికాలము క్రీ.శ. 1085. (SII. VIII. 367) తిరిగి అనంతపురం తా, రాచపల్లిలో క్రీ.శ. 1121లో పశ్చిమ చాళుక్య భువనైకమల్లునికాలములో ఒరయూరి పురవరాధీశ్వరాది బిరుదాంకితుడైన చోడరాజు రెడ్డియపల్లి మల్లికార్జున దేవాలయ స్థానాపతి మల్లికార్జున పండితునికి దానధర్మము లొనరించినాడు. (69/1141-42). కల్యాణిచాళుక్యుల క్రింద కొందరు తెనుగుచోడు లీ ప్రాంతమును పాలించిరి. వారికి ఒరయూరు పురవరాధీశ్వర మొదలయిన బిరుదములు గలవు. మొత్తముమీద చోళుల కీతడు గురువువలె కాన్పించుచున్నాడు. ఈ మల్లికార్జున మహాముని కాలాముఖ వ్రతస్థుడగుట చేతను, కర్ణాటక, అనంతపుర ప్రాంతము వాడగుట చేతను, బలిగ్రామ మండలి (నేటి బెల్గాం) శాసనకవితలో మిక్కిలి పరిచయము కలవాడయ్యెను. కావుననే కుమారసంభవ నాల్గవ యాశ్వాసాంత పద్యమైన "హరహాసాకాశ గంగాత్యమల జల" యను పద్యము బలిగ్రామ మండలి జైనశాసనకావ్యములోని దానికి ఛాయగా కుమార సంభవమున వెలసినది. బహుశః సంస్కృతాంధ్ర కర్ణాటక భాషా పండిత్యముగల మల్లికార్జునపండితుడే దీనిని వ్రాసి యుండవచ్చును.

నన్నెచోడుడు కుమారసంభవమున నొకచోట ఇట్లు వ్రాసియున్నాడు: తన కూతురు పార్వతిని శివుని పరిచర్యకు నియోగించి సెలవు తీసుకొను నవసరమున హిమవంతుడు (3-101) శివుని "యియ్యెండ బాసి పోవగా నోపుదునే" అని ప్రార్థించినాడు. హిమవంతునికి శివు డచ్చట స్థిరముగా నుండుటయే ఇష్టము. అప్పుడు శివు డనుగ్రహించి హిమవంతునితో "సకలలోకాభీష్టఫలవృద్ధి కేదారాత్మకుండ నగుటం గేదారేశ్వరుం డన నీ పురంబున వసియించెద నోడకుండు మని" అభయం బిచ్చినాడు. అప్పటి నుండియే కేదారేశ్వరుడుగా ప్రసిద్ధి కెక్కినాడు. అది హిమవత్పర్వత ప్రాంతము. దాని నిప్పుడు కేదారనాధ్ అని అందురు. కాళిదాసు కుమార సంభవమున నిదిలేదు. ఇట్లు కల్పించుట కొక కారణము - కాలాముఖులకు దక్షిణభారతమున కేదారమఠము గలదు. అది బలిగ్రాం, (బెల్గాం కర్ణాటక) యను ప్రదేశమున గలదు. దానికి దక్షిణకేదారమని పేరు. వింధ్యకు దక్షిణమున గల కాలముఖమఠములలో నిది పెద్దది, ప్రశస్తి కెక్కినది. అదియే కాలాముఖ శక్తి పరిషత్తునకు ప్రధాన పీఠము 11,12 శతాబ్దములలో దక్షిణభారత శైవమతచరిత్రలో నీ మఠము కీలకపాత్ర వహించినది. దీనినిబట్టి చూచినను నన్నెచోడుని గురువు కేదారమఠమునకు చెందినవాడనియు, కుమారసంభవము కర్ణాటక సమీపభూమియగు అనంతపురం మండలమునందు పుట్టినదనియు నూహించుట కవకాశము కలదు. పెద్దలు దీనిని పరిశీలింప గోరెద.

## యథావాక్కుల అన్నమయ్య :

క్రీ.శ. 1242లో యథావాక్కుల అన్నమయ్య రచించిన సర్వేశ్వర శతకములో వీరశైవ పదములేదు. లింగజంగమ శబ్దములు కలవు. తిక్కన, మారన, మంచన, పావులూరి మల్లన కృతులలో నీ పదముండుటకే అవకాశము లేదు.

## పాల్కురికి సోమన:

వేయేల సోమన తొలికృతి అనుభవసారమునందు కూడ వీరశైవ పదము లేకుండుట గమనించవలసిన విషయము. కాని అందు షట్స్థల వివరణ గలదు. బసవేశుని మహిమలకు పరవశుడైన పిమ్మటనే బసవపురాణరచనకు గడంగి వీరశైవ మను పదమునకు ప్రచారము కల్పించినాడు. ఉపలభ్యములగు సాధన సామాగ్రినిబట్టి

చూడగా నీ వీరశైవపదమును తెనుగువారికి తెచ్చిపెట్టినది సోమనాథుడే యని ప్రస్తుతము చెప్పవలసి వచ్చును. తన తొలినెలవగు త్రిపురాంతకము గోళగి మఠస్థులకు ప్రధానమేకాక ప్రథమపీఠము గూడ. అక్కడనే గోళగి గోడగి ఈ పీఠము వాడే తొలిరెడ్డిరాజులకు రాజగురువులు, శ్రీనాథుని సద్గురువు భీమేశ్వరస్వామి త్రిపురాంతక గోడగి మఠగురుపరంపరకు చెందినవాడే (చూ. రెడ్డి సంచిక. 25,26,27 పుటలు) గోడగి త్రిపురారి అనుభవసారమును సోమనచే చెప్పించుకొన్నాడు.

వర్ణరాహిత్యమైన శుద్ధశైవభక్తి మార్గమును తెరచిన వాడు బసవేశ్వరుడు. వర్ణాశ్రమ ధర్మలక్షణములను వదలలేని సవైదిక వీరమాహేశ్వరుడు మల్లికార్జున పండితారాధ్యుడు. వీరిరువురు సమకాలికులైనను ఒకరి నొకరు చూచుకొనలేదు. ఒకరి దేశమును నింకొకరు సందర్శించి యుండలేదు. ఇక వీరిరువురి చరిత్రలు వ్రాసిన సోమన్నకు మల్లికార్జున పండితుని గూర్చి తెలిసినంత స్పష్టముగా బసవన్నను గూర్చి తెలియదు. వీరిరువురి మతవిషయములలోని స్థూల సూక్ష్మభేదము లెట్లుండినను సోమనగ్రంథములు ప్రమాణికము లగుటయే గాక ఆంధ్రదేశ పరిశోధకులకు మతావగాహనలో తికమక పెట్టిన రచనలని మాత్రము చెప్పవచ్చును.

## కాలాముఖులు - ఆరాధ్యులు

తెలుగుదేశమున పూర్వచాళుక్యుల కాలమునుండియు (అనగా 108 శివాలయములు కట్టించిన ద్వితీయ విజయాదిత్యుని (799-847) నాటినుండి) కాలాముఖ పాశుపతులు స్థానావతులై, రాజగురువులై విలసిల్లిరి. రెండవ అమ్మరాజు (946-970) తాడికొండ శాసనములో (EI XIII 161-170) సింహపరిషత్తునకు చెందిన కాలాముఖులు పేర్కొనబడిరి. లకులీశ్వరుని స్తుతి తరువాత పై శాసనములో-

> "తదన్వయే కాలాముఖా శ్రుతి ముఖ్యా స్వయంభువో
> .... ... ...
> తేషా మమరవటేశ్వరా ద్యనేక పురాణదేవాయతన
> నివాసినాం కాలాముఖానాం సన్తతౌ"

అనియున్నది. నరేంద్రమృగరాజు దేశమునం దెల్లెడలను కట్టించిన శివాలయములకు కాలాముఖులే స్థానాపతులై యుందు రనుటలో విప్రతిపత్తిలేదు.

కర్ణాటకమున శ్రౌతులయిన కాలాముఖులు బిజ్జలుని అనంతరము వీరశైవు లయినట్లు, తీరాంధ్రమున, తెలంగాణమునందును, రాయలసీమయందును కాలాముఖులు కాలక్రమమున ఆరాధ్యులై యుందురు. బసవేశ్వరోపజ్ఞమైన వీరశైవము వర్ణరాహిత్య శివభక్తి మార్గమును స్థిరముగా ప్రతిష్టించినది. దాని కతడును, అతని అనుయాయులును సాహసోపేతమైన యుద్యమమును నడపిరి. తెనుగునాట అంత ప్రళయము జరుగలేదు గాని కాలాముఖ పాశుపత బ్రాహ్మణులు యుక్తి ప్రయుక్తలతో వాదోపవాదములు జరిపి, అద్వైతాదిమతములను ఖండించి, శివాధిక్యమును వేదోక్త, పురాణోక్తముగ ఆరాధ్య సంతతిని స్థాపించిరి. ఉద్భటారాధ్య, కోటిపల్యారాధ్య, వేమారాధ్యులను ఆరాధ్య త్రయమును, మంచన, శ్రీపతి, మల్లికార్జున పండితులను పండితత్రయమును, తెలుగుదేశమున వీరమాహేశ్వరసమయమును సవైదికమొనర్చి, అనేక నిబంధన గ్రంథములను సంస్కృతాంధ్రభాషలలో రచించి, వీరశైవ, వీరమాహేశ్వర సంప్రదాయములను సుస్థిరమొనర్చిరి. పాశుపాత కాలాముఖులును లింగధారులే.

"హృన్నాభిషు లింగధారిణః పాశుపతాః" అని ఆనందగిరి శంకరవిజయము తెల్పుచున్నది. బలిగ్రామ కాలముఖశాసనములలో నీవిషయము స్పష్టముగా నున్నది. (నంజుండారాధ్య. 54-55) కాని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (బసవ. పీ. 73) కాలాముఖ పాశుపతాదులు లింగధారులు గారనిరి. అందు వారు ప్రమాణముగా గొన్న గ్రంథములు అర్వాచీనములు. పాశుపతులు హృదయమున లింగమును ధరించగా, వీరశైవులు కంఠములందు ధరించెడివారని క్రీ. శ. 1242లో యధావాక్కుల అన్నమయ్య 'భక్తగాత్రము లందెప్పుడు నుండుఁగాన' (సర్వే. 24) యని సాక్ష్యము నిచ్చుచున్నాడు. కాలాముఖము వీరశైవముగా మారినకాలమున శ్రీనాథుడు వెలసినాడు. అయినను కాలాముఖ పాశుపతము మీదనున్న అభిమానము చేతనో మరి యే కారణముననో హరవిలాసమున తనకు వీలగువట్టుల కాలాముఖ ప్రశంసచేసియున్నాడు. 'కాలాముఖ వీరపాశుపత లాంచనధారులు' (5-14) శ్రీనాథుడు బసవనను గూడ అవతారికలో పేర్కొనినాడు అని చెప్పుటయే గాక కాలాముఖుడైన శివుని ని ట్లభివర్ణించియున్నాడు.

"కలికి కాటుక గీర్బొట్టు పలుగుపేరు
జాతిగాఁ దాల్చి నెఱమిండజంగమగుచు
బిక్షాటనంబునకుఁ జొచ్చె"

(హరవి. 5-41, 42) కాలాముఖు లనగా నల్లని గీర్బొట్టును నొసట పెట్టుకొనెడివారు. కాటుక గీర్బొట్టు అట్టిదే. ఈ విధముగా కాలాముఖ పాశుపతులు వీర శైవులై ఆరాధ్య బ్రాహ్మణులయి యుందురు. ఈ పరివర్తనము నింకను శోధింపవలసియున్నది.

## వ్యాససారాంశము

1. ఆంధ్రదేశపు శైవమత స్వరూపము నెరుంగుటకు గోళగిమఠాధిపతుల చరిత్ర ముఖ్యముగా చదువవలసినది యగును గోళగి మఠస్థులు, పాశుపతులు, కాలాముఖులు పశ్చిమ బెంగాల్, మధ్యప్రదేశ్, గుజరాత్ ప్రాంతములనుండి వచ్చిన శైవబ్రాహ్మణులు.
2. తీరాంధ్ర రాయలసీమ ప్రాంతములందు గోళగి (బిక్షాధ్యాయి) కాలముఖ పాశుపతులును, పశ్చిమాంధ్రమున శక్తిసింహపరిషత్తుల కాలాముఖ గురువులును ప్రవేశించి ప్రసిద్ధ శైవ క్షేత్రములైన శ్రీశైల, త్రిపురాంతక, ద్రాక్షారామ మందడ, అలంపుర, కొలనుపాక స్థలములందు మఠములను, విద్యామంటపములను నెలకొల్పి, వేదాది విద్యలు విస్తరింప జేసిన సాత్వికపురుషులు. జనసామాన్యమునకు విద్యాపీఠములనే గాక వైద్యాలయ, అన్నసత్రాదులను నిర్మించిన పరమ మహోపకారులు.
3. కర్ణాటకమున కాలాముఖము బసవని వీరశైవములో కలిసి పోయినది. ఆంధ్రమున కాలాముఖ, గోళగి పాశుపతము వీరమాహేశ్వర సవైదిక వీరశైవములో నంతర్లీనమయినది. కాలాముఖబ్రాహ్మణులే ఆరాధ్యులైరి.
4. సోమనకు పండితుని గూర్చి తెలిసినంతగా బసవనను గూర్చి తెలియదు. అయినను సోమనాథుడు ఇరువురి మహనీయుల చరిత్రలను సంపూర్ణమైన కవితాకళను జోడించి అటు కన్నడులకును, ఇటు తెలుగువారికిని పరమ ప్రామాణికుడైనాడు.

5. వీరశైవమను పదము తెలుగుదేశమునకు కొత్తది. అది సోమనాథుని మూలముననే తెనుగున ప్రచారమొంది యుండును. బసవన వర్ణాశ్రమరహిత లింగాయత మతము కర్ణాటక సరిహద్దులను దాటి తెనుగునేల జొరకుండచేసి శాంతి భద్రతలను, వర్ణాశ్రమ ధర్మములను నిలబెట్టినవారు గోళగి మఠమువారు.
6. నన్నెచోడుని జంగమ మల్లయ్య కాలాముఖాచారి. అతడు వీరశైవుడుకాడు. కర్ణాటక శక్తిపరిషత్తు కేదారమఠమునకు చెందినవాడై అనంతపుర, శ్రీశైల ప్రాంతములవాడై యుండును. కేదారమఠ కుడ్యభాగముల శిలోట్టంకితమైన గంభీర కన్నడ కవితాశైలివలె తెనుగున కుమారసంభవము వెలసినది. కనుకనే కవిత్రయ కవితా స్రవంతి కది కొత్తనీరు. నన్నెచోడుడు తిక్కనకు తరువాత డనువాదము అతి నీరసము, చారిత్రక గతికి భిన్నము.
7. పుష్పగిరి, శ్రీశైలము మొదలగు స్థలములలో భిక్షావృత్తిమఠములు గోళగి మఠములే. సిద్ధభిక్షావృత్తి, వారణాసి భిక్షావృత్తి, వీరశైవ భిక్షావృత్తి, అజాతి వీరశైవ భిక్షావృత్తి అయ్యవారలు ఒకానొకప్పుడు గోళగి మఠాచార్యులే, పుష్పగిరిలోని అఘోర శివాచార్యులును, (మాదయగారి మల్లన, నంది జంటకవులు, నంది తిమ్మన, గురువు). శ్రీశైల శాంతభిక్షావృత్తి (గౌరన శ్రీనాథుల కృతి పోషకుడు) గోళగి శివాచార్యుల పరంపరలోని వారే. అట్లే తిరుమలినాథకవి శైవాచార సంగ్రహమునందు కీర్తింపబడిన వారణాసి సిద్ధాభిక్షా వృత్తియు.
8. కాకతీయుల తరువాతి శైవమును గూర్చి ఇందు చర్చించ లేదు. ఏకామ్రనాథ, కాసె సర్వప్ప, కూచిమంచి జగ్గకవుల గ్రంథములు అర్వాచీనములు.
9. తెలుగుదేశ చరిత్రలో 11,12,13,14 శతాబ్దములు మిక్కిలి ప్రాముఖ్యము గలవి. తెలుగు వాఙ్మయమునకు, మతమునకు అవినాభావ సంబంధము గలవి. అవి రెండును చక్కగా సమన్వితము కాలేదు. అయినవాడు ప్రాచీనాంధ్రకవులు దేశమునకు, భాషకు, మతమునకు నొనర్చిన సేవ విస్పష్టము కాగలదు.

## అధోజ్ఞాపికలు

1. తేఱంబి. Terahi, Jabbalpur (M.P.)తేరామ్, జబల్‌పూర్ (మధ్యప్రదేశ్)
2. తిక్కన ని. ఉ. రా. అవతారికలో "బిరుదు వెలుంగ బిజ్జఁ డరిభీకర" (1-28) అని యున్నది. "బిరుదు తెలుంగు బిజ్జఁ డరి" యని యుండవలెను. కీర్తి మెఱసి

అని యుండునుగాని బిరుదు వెలుంగట యుండదు.

3. Hanumakonda Niroshtya Kavya Inscription (EI. XXXVI 209-218)

దీనిని రాష్ట్ర ఆర్కియాలజీశాఖవారు ప్రత్యేకగ్రంథముగా ప్రచురించియున్నారు.

4. ఇది పశుపాశపతి జ్ఞానమును దెల్పు కృతి. కొలని గణపతిదేవుడు ఇదే శీర్షికతో రచించినాడు. అది అలభ్యము. (చూ. శివయోగసార పీఠిక)

5. ("వీరశైవైక సిద్ధాంతే సర్వశ్రుతి సమన్వయః-నంజాడారాధ్య 66) శ్రీపతి పండితుడు శ్రీకరభాష్యకర్త కాడని యిటీవల చక్కగా నిరూపితమైనది. (భారతి మార్చి 1975. పుటలు 36-42 కుమారి లలితాంబ)

## అనుబంధము

### గోళగి, మఠములు - గురువులు (క్రీ.శ. 724-1313)

| నెం | కాలము క్రీ.శ. | పేరు | మఠము | స్థలము | జిల్లా |
|---|---|---|---|---|---|
| 1. | 724-758 | పద్మశివుడు | గోళగి | బిక్కవోలు | తూర్పు గో. (1) |
| 2. | " | వామశివ, పురుషశివ | " | వసంతవాడ | పశ్చిమ గో. (2) |
| 3. | 936 | వరుణశివ | - | గొనిమోర్పుగల్లు | అనంతపురం (25) |
| 4. | 945 | సద్భావశివ | - | త్రిపురి | మధ్యప్రదేశ్ |
| 5. | 10వ. శ. | అనంతశివ | - | హేమావతి | అనంతపురం 26 |
| 6. | 1019 | ముగ్ధశివ - సద్యశ్శివ | - | ఏలేశ్వరం | నల్గొండ 29 |
| 7. | 1041 | వామశివ (శంభు) | - | త్రిపురి | మధ్యప్రదేశ్ |
| 8. | 1073 | రుద్రశివ | - | సంగమేశ్వరం | అనంతపురం 27 |
| 9. | 1077 | ఉత్తమశివ | - | తుడూరు | కడప14 |
| 10. | 1095 | సోమశంభు | | వారణాసి | ఉత్తరప్రదేశ్ |
| 11. | 1127 | ఈశానశివ | | సత్తెనపల్లి | గుంటూరు7 |
| 12. | 12వ.శ | ఈశానశివ | | హేమావతి | అనంతపురం 28 |
| 13. | 1123-63 | శక్తిశంభు, కీర్తిశంభు | | త్రిపురి | మధ్యప్రదేశ్ |
| 14. | 1212 | విమలశివ | | త్రిపురి | మధ్యప్రదేశ్ |
| 15. | 1216 | సుబ్రహ్మణ్యశివ | | తడికలపూడి | ప. గో. (3) |
| 16. | 1234-52 | ధర్మశివ | | కాళేశ్వరం | కరీంనగర్33 |
| | | | | వరంగల్లు | వరంగల్లు 31 |

| | | | | |
|---|---|---|---|---|
| | | | త్రిపురాంతకం | కర్నూలు 18 |
| 17. | 1237 | వరుణశివ | పుష్పగిరి | కడప 15 |
| 18. | 1243 | పరిపూర్ణశివ | భట్టిప్రోలు | గుంటూరు 8 |
| 19. | 1243 | సిద్ధాంతశివ, | | |
| . | | అనుగ్రహశివ | తడికలపూడి | ప.గో. (4) |
| 20. | 1253 | విశ్వేశ్వరశివ | కమ్మంపల్లి | కరీంనగరం 34 |
| | | | మందడం | గుంటూరు9 |
| 21. | 1254 | శాంతశివ | గంగాపురం | నెల్లూరు -13 |
| 22. | 1258 | సదాశివ | కంభంపాడు | గుంటూరు-10 |
| 23. | 1260 | శాంతశివ | శ్రీశైలం | కర్నూలు-19 |
| 24. | 1263 | శాంతశివ | త్రిపురాంతకం | కర్నూలు-20 |
| 25. | 1267 | శాంతశివ | ఏలేశ్వరం | నల్గొండ-30 |
| 26. | 1271 | త్ర్యయంబకశివ | త్రిపురాంతకం | కర్నూలు-21 |
| 27. | 1257 | ఈశానశివ | పుష్పగిరి | కడప 16 |
| 28. | 1271 | శ్రీకంఠశివ | త్రిపురాంతకం | కర్నూలు-22 |
| 29. | 1271 | ఉత్తమశివ | భట్టిప్రోలు | గుంటూరు-11 |
| 30. | 1275 | ఉత్తమశివ | తడికలపూడి | ప. గోదావరి (5) |
| 31. | 1282 | కాశీశ్వరశివ | మందడం | గుంటూరు-12 |
| 32. | 1290 | నందశివ | త్రిపురాంతకం | కర్నూలు-23 |
| 33. | 1292 | సోమశివ | పెదకళ్లేపల్లి | కృష్ణా (6) |
| 34. | 1293 | శంకరశివ | సోమశిల | మ.నగర్ 35 |
| 35. | 1313 | చంద్రభూషణశివ | త్రిపురాంతకం | కర్నూలు-24 |
| 36. | 1313 | అఘోరశివ | వరంగల్లు | వరంగల్లు-32 |
| 37. | 1313 | ఈశ్వరశివ | పుష్పగిరి | కడప 17 |

## గ్రంథసూచి

ఉస్మానియా వి.వి. ఆంధ్రమహాభారతము సంశోధిత ముద్రణ అన్నమయ్య్య

యథావాక్కుల-సర్వేశ్వర శతకము. ఆం.సా.ప. కాకినాడ. 1919

కాకతీయ సంచిక - రాజమండ్రి. 1935.

కృష్ణారావు, భావరాజు వేంకట - రాజరాజనరేంద్రుడు మద్రాసు - 1950

చెన్నారెడ్డి జె-శైవసిద్ధాంతము - ఒక పరిచయము S.V. Univ. Journal (off print)
తిక్కన - ఆంధ్రమహాభారతము - ఉస్మానియా విశ్వవిద్యాలయ సంశోధిత ప్రచురణ.
తెలంగాణా శాసనములు - సం. I,II, 1935, 60.
నంజుండారాధ్య. ఎం. జి. సం. తత్త్వప్రకాశ. కన్నడ లిపి.
నంది మల్లయ - ఘంట సింగయ - ప్రబోధచంద్రోదయము, హైదరాబాదు 1976
నన్నెచోడుడు - కుమారసంభవము - మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణ 1948
నరసింహారెడ్డి వే. పాల్కురికి సోమన - సిద్ధాంత గ్రంథము. (అముద్రితము)
మంచన. కేయూరబాహుచరిత్ర. మద్రాసు. 1970.
మల్లికార్జున పండితుడు - శివతత్త్వసారము.
వీరభద్రరావు, చిలుకూరి -ఆంధ్రుల చరిత్ర - ద్వి. భా. చెన్నపురి. 1912
వేంకటరమణయ్య డా. నేలటూరి - విష్ణుకుండినులు, హైదరాబాదు. 1973.
పాల్కురికి సోమనాథుఁ డెప్పటివాఁడు? వావిళ్ల, మదరాసు 1955.
ఆంధ్రమహా భార. ఉ. వి. వి. ప్రచురణ - హైదరాబాదు 1973.
శేషయ్య, చాగంటి - ఆంధ్రకవితరంగిణి 3వ. సం.
శైవాచారసంగ్రహము - కుంటుముక్కుల తిరుమలనాథకవి. మద్రాసు 1951
శ్రీనాథుడు - హరవిలాసము - వావిళ్ల 1973.
సీతారామయ్య, కురుగంటి - శైవము. ఆంధ్రదేశము 'ఆంధ్రపత్రిక' ఉగాది సం. 1955 - 56.
సోమన పాల్కురికి - అనుభవసారము - వావిళ్ల - 1955.
బసవపురాణము. ఆంధ్రగ్రంథమాల మద్రాసు. 1926
పండితారాధ్య చరిత్ర - ఆం. గ్రం. మాల మద్రాసు. 1939.
Audilakshmi : History of Saivism in Telugu Literature (Thesis) Madras University.
A.P. Govt. Report on Epigraphy for 1965.
" " 1966.

E.I. Epigraphia Indica.
Hanumantha Rao, B.S.L. Religion in Andhra, Guntur, 1973.
Haribhadrasuri - Shaddarsana Samucchaya. With commentary of Gunaratna
Tarka Rahasya : Calcutta 1905 -14
Inscriptions of A.P. Warangal Dt. 1974. Kareemnagar Dt. 1974
Lorenzen David. The Kapalikas and Kalamukhas, New Delhi, 1972.
Majumdar - History of Ancient Bengal Calcutta 1974.
Mirashi. V. V. Corpus Inscriptionium Indicarum Ooty 1955.
Nandi Ramendranath - Religious. Institutions
and cults in the Deccan, New Delhi - 1973.
Rama Rao. M. Inscriptions of Andhra Pradesh Vol II - Part II. Tirupati 1968.
Rangachari V. A. Topographical list of the Inscriptions of Madras Presidency Vol II 1919.
Sicar D.C. Studies in Religious life of Ancient & Medieval India New Delhi -1971.
Sayana Madhava - Sarvadarsana Sangraha- Chowkamba - Varanasi 1964.
Somasekhara Sarma M. History of the Reddi Kingdoms, Waltair, 1948.
Sudhakar Chathopadhyaya - Evolution of Hindu sects. New Delhi 1970.
Yazdani - The Early History of the Deccan Part VII-XI-1960.

## మాల్కాపుర శాసన పూర్తిపాఠము

1. స్వస్తిశ్రీః వితరతు భగవా నసౌ శ్రియం వః కరివ-
2. దనో హరినీలభాసి యస్య । ద్యుతి వరసరసిస్ఫురత్త -
3. రంగ్గశ్రియ మధికా మళిపంక్తయో వహంతి ॥ జయ
4. తీందోః కలా ఖేలతు గంగాంభః కణదంతురైః । కరైః కరోతియా శ-
5. ంభో మూర్ధ్ని ముక్తావలిశ్రియం ॥ హరిరవతు కిరితను వ్యో
6. (భు)వ ముద్వోఢుం గతస్య వరుణపురిం । యస్యాఖిల జలధిజ-

7. లం పాద్యాయాభూ దనగ్ఘ్య యు ॥ జయతి భగవాను న్వయ -
8. ంభూ గ్గ్ణపతి నృపతే హృ్ది స్థిత స్సతతం । యత్కారుణ్యకటా-
9. క్షైవృ్ద్ధిం ప్రాప్తాంధ్రదేశశ్రీః ॥ అస్తి స్వస్తిమతీరను భృ్గవతో
10. దేవస్య తస్యా స్ఫుర న్నాభీపంకజసంభవస్య భుజతో భూవల్లభా జ-
11. జ్ఞిరే । తేషాం తిగ్మమరీచిసంతతిభువో యే దుర్జ్జయాః క్షత్రియా స్తేషా
12. మస్తి కులం కలంకరహితం శ్రీకాకతీభూభుజాం ॥ వీర స్తస్మా ద-
13. జని రజనీనాథవ ద్దుగ్ధసింధోః కీర్తి్ జ్యో్ త్స్నా భరితభువనః ప్రోలభూపాల
14. నామా । రాజ న్యస్మి స్కమపి నృపతిం రాజశబ్దాభిధేయ న్నై వా స్రా -
15. ష్మ త్రిజగతి వినా యామినీకామినీశం । కీర్తి్ య్య్ స్య హిమేందుకుందవిశ-
16. దా మూర్తి్ జ్జనా నందినీ దానం విశ్వజనార్తి్ హారిచరితం గంగాపయః
17. పావనం చిత్తం శంభుపదారవిందయుగళ ధ్యానామృతక్షాలితం శౌ -
18. య్య్ం విష్వగరాతిదుమ్మ్దహరం ధామాపి ధామశ్రియః॥ రుద్ర -
19. దేవ స్తతో జాతో యత్కీత్యా్ భూ రలంకృతా। ప్రతి పక్షమహీపా-
20. లయశోనిర్మా్ ల్య ముజ్ఝతి ॥ రాజానః కతివా నసంతి సుభటా స్స-
21. ంక్రాంతవిక్రాంతయ స్తే తిష్ఠంతు త మేకమేవ శృణుమ శ్శూరేషు రుద్ర-
22. ం నృపం । య స్యాసీ దసిదారితారినృపతి శ్రేణీశిరం: కందుకక్రీడాం బ్రీడి-
23. తవిక్రమా యుధి జయశ్రీః ప్రేయసీ స్థేయసీ॥ఏక ఏవ ధనుర్వీరో రుద్రదేవోమ-
24. హీభుజాం । సురేశ్వరాణాం సర్వే్ షాం పినాకీవ ధనుష్మతాం ॥ అ థానుజ
25. స్తస్య మహీశశాస ధీరో మహాదేవనృపో మహౌజాః॥ ప్రతాపదీపాః
26. ప్రతిపక్షభాజాం శామ్యంతి య త్శౌయ్య్ కథానిలేన । కుందేందుచందన -
27. సఖః కుముదస్య మిత్రం స్వస్సింధుసింధురతురంగరుచాం సనాభిః॥
28. కర్పూ్రహారహరహాసపయః పయోధిబంధు ర్వి్ భాతి య దుదార-
29. యశోవిలాసః ॥తస్యాయం తన స్త్రయీమయతనో ర్దే్వా ద్భవానీపతే ల్
30. (బ్ధః) క్ష్మాం సమపాలయతు గణపతిః క్ష్మాపాలచూడామణిః । యస్మి
31. న్విస్మయకారి విక్రమకథాధారాముచి శ్రీఘనే పృథ్వీ దుష్ట దురీశదావదహ-
32. సంప్రాప్తాం రుజం ముంచతి ॥ దర్పో్ ధన్వని మత్సరో రణజయే ధాష్ట్య్ం
ద్విపారో -

33. హణే। క్రౌర్యమ్ం శౌర్య్ విధౌ తురంగదమనే చాపల్య మాశా యుధి। క్రోధో దుష్ట-
34. జనే భయం ద్విజధనా లోభశ్చ ధర్మా ర్జ్జనే పూజా కర్మ ణి శాంకరే గణపతిక్షోణీ-
35. పతే రాగ్రహ : ॥ కోదండోచ్చండ వేగవ్యథితకరిహయవ్రాత పృథ్వీశ సైన్యం కిం బ్రూమ
36. శ్చండిమానం గణపతినృపతే బ్బా హుదండద్వయస్య। అద్యా ప్యుద్దామదర్పా దుపర -
37. తపృతనా కోటికంకాలకూట ప్రక్రీడతు ప్రేతయూధవ్యతికరవిషమభూ -
38. మయో భీషయంతే ॥ కతికతి న సంతి భూపాః కతికతి గుణగణాభ -
39. రణా :। గణపతినృపతి స్త్వే కో నరపతిశతపోషకః క్షోణ్యాం ॥ నిష్ప్రాణరవ
40. సంత్రస్తా : క్షణా ద్గణపతే నృపాః। అపి త్యజంతి దుర్గా ణి నదారానేవ కేవ -
41. లం ॥ రుద్రదేవీ సముదభూ త్పురణ్యా త్సర్వ భూభృతాం। గంభీరా న్మహత
42. స్తస్మాల్లక్ష్మీ రత్నాకరా దివ ॥ సర్వో ర్వీశకిరీటకుట్టిమతటీ విన్యస్త పాదాంబుజా శా
43. స్త్యేషా చతురంబురాశిరశనాం శ్రీరుద్రదేవీ భువం। యస్యా జ్జన్మమహోత్సవో
44. గణపతేః క్ష్మాపాలచూడామణే ర్విస్ఫూర్జ్జత్కలికాలకల్మషక(థా) ధ్వాంతౌఘ
45. తేజోనిధే :॥సాంబ్రాజ్యే ఖిల వర్జ్జితం విరచితే శ్రీరుద్రదేవ్యాస్స్వయం చాతుర్వ
46. ణ్య నిజస్థితి ర్విజయతే విద్రాతికాలః కలిః ధర్మా సౌ భగవా న్విభాతి దురితం
47. దూరే ద్విజానాం ద్విష స్తన్నామగ్రహభీషితా నిజపురా న్నియ్ంతి పర్యా కు -
48. లాః ॥ ఆక్రామంతి తరత్తరంగవిగళద్దుగ్ధాబ్ధి ఫేనావలీ రాచామంతి శరత్ప -
49. శాంక విలసద్జ్యో త్స్నా ప్రవాహామృతం। ఆకష్ంతి సురేంద్రదంతిదశన
50. ప్రాగ్భారలగ్నాం శ్రియ(ం) ముక్తాహారలతాయితాః ప్రతిదిశం రుద్రాంబికా -
51. కీర్త్యః శ్రీవిశ్వేశ్వరదేశికేంద్రశివహస్తోసి దోర్వి క్రమ స్త్రిక్షణీశ
52. జగద్దళః ప్రతిబళప్రధ్వంసిజన్మోత్సవః। యస్యాః కాకతివంశమౌక్తిక -
53. మణే శ్రీరుద్రదేవస్సుత స్తస్యాః కిం కథయామ వైభవ మత శ్రీరుద్రదేవ్యా-
54. : పరం ॥ అస్తి విశ్వంభరాసారః కమలాకులమందిరం। భాగీరథీనమ్మ్ద
55. యో మ్మ్ధ్యం దహాలమండలం ॥ ఉగ్రం తత్ర తపశ్చర న్నియమయ

56.న్బాహ్యేంద్రియక్రీడనం । సాంద్రానందమయే సమాధిసమయే
57.చిత్తేన లీన శ్శివే। నీత్యాకాల మనంత మంతకజయీ సచ్ఛావశంభు
58.గ్గ్ రు ద్ధ్ వ్వ్ సోన్వయసంభవ స్సుచరిత: ప్రాబుద్ధపుణ్యాన్నృణాం శైవానా -
59.ం ప్రథమాయ శంకరపదధ్యానామృతాంభోనిధిక్రీడాంబ్రేడనకమ్మ్ నిమర్మ్ -
60.లతరస్వాంతాయ శాంతాత్మనే । తస్మై నిస్పృహచేతసే గళచురిక్ష్మాపాలమా -
61.ణామణి గ్రామాణాం యువరాజదేవనృపతి ర్భిక్షాం త్రిలక్షీం దదౌ ॥కృత్వా
62.స శైవముని రద్భుతశిలమూర్త్తి శ్రీగోలకిమఠ ముదార ముదాత్త చిత్త :
63.(త) స్యాకర స్స నృపదేశికమౌక్తి కానాం వృత్తిం చకార సకలా మపి తాం త్రలక్షీం
64.।ప్రాచీన పుణ్యపరిపాకవశా త్ప్రజానా మావిర్బభూవ భగవా నిహ సో -
65.మశంభు: । నామ్నా నిజేన సకలాగమసింధుసేతుం య్యై పద్ధతిం కరుణ-
66.యా ప్రతిమాం బబంధ ॥ అథ నృపశేఖరమాలాలాలితపాదో త్ర వామశ
67.ంభు రభూత్ । అద్యాపి కలచురీశా యచ్చరణారాధకా: ప్రశస్యంతే । లబ్ధ
68.దేశికపదా మనోహరా భూరిదాన పరితోషితార్థి న:। యత్ర మత్తకరి -
69.ణోపి కుర్వ్తే పాశభేద మిహ భద్రజాతయ : ॥ తస్మి న్మఠే తస్య గురోర్బభూవు
70.శ్శిశ్యా: ప్రశిశ్యా శ్చ పరస్సహస్రా: । వినిగ్రహీతుం సమనుగ్రహీతుం క్షోణీ -
71.శ్వరా న్దక్షకటాక్షపాతై:॥ ఇత్థం కాలే యాతి సత్సంప్రదాయే సంతానే స్మిన్న -
72.ర్థి సంతానకల్ప శ్శంభోధే శ్శక్తిశంభో రుదారా చ్ఛిష్య శ్రీమాన్కీర్త్తి శంభు ర్బభూవ ॥
73.ప్రణామవ్యాలో లత్కలచురిమహీపాలపరిషత్కిరీటప్రక్రీడత్కిరణకలికాలా-
74.లితపదా: । యశ:పూరస్స్వైరస్తబకితదిశ: కేరలభవాస్తత: పద్మావాసా విమ -
75.ళశివపాదా స్సమభవన్ ॥ నిర్వైర ముర్వ్యాం కలికాలమధ్యే స్థాతుం పదాభ్యా(ం)
76. కుతుకీవ ధమ్మ (చి): । శిష్య:కృపాకందలితాంతరాత్మా తేషా మబూ ద్ధ మర్మ్శివోమునీ -
77. ంద్ర: ॥ యం కృపానిధి ముదారవైభవం ధర్మ్మశంభు మఖిలార్త్తి భంజనం ఏకవ -
78. క్త్రకమలం సదాశివం సంకథానుకృతిన: ప్రచక్షతే ॥ అధ్యేతా నిగమస్య ధమర్మ్తన -
79. య శ్రీగౌడరాఢోల్లసత్పూర్వ్ గ్రామశిఖామణి గ్గ్ణపతిక్ష్మాపాలదీక్షాగురు:

80. క్షీరాబ్దే రిన చంద్రమాః శ్శశికలామౌలే య్యర్ధా షణ్ముఖః శ్రీ విశ్వేశ్వరశంభురు-
81. గ్రతపసశ్శ్రీధమర్మ శంభోరభూత్॥ చిరం పృథ్వీపాలావలీనుకుటఘృష్టాంఘ్రికమల ద్వయో
82. విద్యావల్లీ వలయకలనాకల్పతరు । సదాదాంతస్స్వాంత స్థిరతరో లసద్యూబట్టీ
83. మహాశాంత : కాంతో జయతి భువి విశ్వేశ్వరశివః ॥ శ్రీ చోళీశ్వర మాళవ -
84. క్షితిపతీ రాజన్యచూడామణీ యత్ఛిష్యౌ కిమతఃపరం గణపతిక్షోణీపతి య్యత్
85. త్సుతః నస్యాత్కస్య ముదే సదేశికవర శ్శైవాగమాంభోనిధి శ్రీ విశ్వేశ్వరదేశికః కల -
86. చురిక్ష్మాపాల దీక్షాగురు : ॥ గౌడా : పూర్ణమనోరథా : కతికతి ప్రాప్తశ్రియ
87. స్త్రాపసా । స్సంతుష్టా : కవిపుంగవాః కతికతి ప్రధ్వస్తపాశాన్నృపాః యే తస్మిన్
88. గణపత్యధీశ గురుతాసింహాసనాధ్యాసిని శ్రీవిశ్వేశ్వరదేశికే శివపురీ విశ్రా-
89. ణనశ్లాఘిని ॥ త్వంగత్పింగజటాకిరీట ముదయస్మేరారవిందాననం ముక్తాకుండల.
90. తాడితాంసశిఖరం హారైమ్మనోహారిణం । విద్యామండపవర్తినం గణప -
91. తిక్ష్మాపాలదీక్షాగురుం । శ్రీవిశ్వేశ్వరశంభు మీక్షితవతాం తే చక్షుషీ చక్షుషీ
92. లోహః కోయం శకస్యాబ్దే దుమ్మ తౌ వత్సరే శుభే । చైత్రే సితేతరాష్ట మ్యాం వా -
93. రే శుక్రాభిధానకే । విషయే వెలినాడాఖ్యే కంద్రవాట్యాం విశేషతః । యదుత్త -
94. రేణ వహతి కృష్ణవేణీ మహానదీ ॥ శ్రీ విశ్వేశ్వరశంభవే గణపతిక్షోణీశ్వరేణా -
95. దరాద్గ్రామ (ం) మ్మందరనామధేయ మఖిలై ర్వ్యోగ్రత్త మాయై స్సమం । తత్సు
96. త్రీ తదనుజ్ఞయా పశుపతేః శ్రీ రుద్రదేవీ పురః ప్రాదా ద్గ్రామ వెలంగపూండిస
97. హితం సీమాష్ట కే నావృతం ॥ అష్టస్వామ్యేన సహితం ధారాపూర్వ్వం సకర్షకం కృ-
98. ష్ణవేణీ నదీమధ్యగతయా లంకయా సహ ॥ తస్యగ్రామస్య సీమాన : కథ్యం -
99. తే పూర్వ్వ తః క్రమాత్ । పరిజ్ఞానాయ సర్వ్వేషాం భాష యాంధ్ర్యా స్ఫుటార్థ -
100. యా । పూర్వ్వస్యాం । పెనుంబాక దిక్కు మెదవిఱుపుం గాల్వ పొలమెర । దక్షిణస్యా -
101. గ్నేయ్యాం । తాండినుండి వచ్చిన మద్దిమడ్డుకాల్వ పొలమెర - దక్షిణస్యా-
102. ం । కట్టుంగొమ్ము కాల్వ పొలమెర - నైరుత్యాం - ఉప్పలపాటి చెఱ్వు పడుమ
103. టికొమ్మురావిపూండి వెలంగపూండి పొలమునందు పొలమెర । పశ్చి -
104. మాయాం । మందరానకూను వెలంగపూండికిని పడుమటి రావి -

105. పూండి పొలములోని నల్లందుమ్మ ఉత్తరము పెనుంబడియ పొలము -
106. సందు పొలమెర । వాయవ్యాం । పెరకమ్మ నుండి వెడ్లిఇమ్మంగాలి కాల్వన
107. తలపొలమెర । అది మొదలు ఈశానపర్యంతము కృష్ణవేణియే పొలమెర ।
108. అయిశాన్యాం । కృష్ణ వేణినుండి వెనుంబాకరెడ్డి త్రవ్వించిన కాల్వ తలపొలమెర ॥
109. రావిపూండికి ఐశాన్యము । ముందరానుకూను వెలంగపూండికిన్ని వాయవ్య-
110. ము పెరకమ్మనుండి వచ్చిన పాయేటితల పడుమటి సీమగాను మందర -
111. పులంక ॥ శ్రీ విశ్వేశ్వరదేవ మిందుకలికాచూడం మఠం శాశ్వతం సత్రం వి -
112. శ్వజనాగ్రహారసహితం సుస్థాప్య నిత్యోజ్జితం । శ్రీ విశ్వేశ్వరగోళకీత్యభిధ -
113. యా తం గ్రామ మత్యాదరాత్ శ్రీ విశ్వేశ్వర స్సమయుజ త్రీగౌడచూ -
114. డామణి : ॥ నానాగోత్రసముద్భూతా ద్రావిడా యే ద్విజోత్తమాః । పరస్ప -
115. రం ప్రకుర్వాణా : క్రయవిక్రయ మాదికం ॥ షష్టి సుఖ్యా విశిష్టేభ్య : ప్రత్యేకం
116. పుట్టి కాద్వయం । పెనుంబాక ప్రసిద్ధేన మానదండేన సమ్మితం స్థిత్యుపాధిమ
117. దాత్తేభ్య శ్రీ విశ్వేశ్వరదేశిక : ॥ ఏతతు క్షేత్రంతు పుట్టినాం వింశత్యా భ్యధికం శ -
118. తం । వెలంగపూండి సహితం దత్తం మందరనామని ॥ త్రిధా విభజ్య తత్సి -
119. ష్టమేకం భాగం పినాకినే । విద్యార్థిభ్యో పరం భాగం శుద్ధ శైవమఠాయ
120. చ । ప్రసూత్యారోగ్యశాలాభ్యాం విప్రసత్రాయ చేతరం । ప్రాదా ద్విశ్వేశ్వరశి -
121. వ శ్శైవసిద్ధాంతపారగ : ॥ రుగ్యజుస్సామవేదానాం సమ్యగధ్యాపకాస్త్ర -
122. య : పదవాక్య ప్రమాణానాం సాహిత్య స్యాగమస్య చ ॥ పంచవ్యాఖ్యాకృ -
123. తో వైద్యకాయస్థా ద్వౌ విచక్షణౌ ॥ దశానా మపి చైతేషాం ప్రత్యేకం పుట్టికా -
124. ద్వయం ॥ శ్రీవిశ్వేశ్వరదేవస్య నర్త్తక్యో దశసంఖ్యయా । ముఖరీద్వయ సంయుక్తా
125. అష్టౌ మర్దలవాదకా : ॥ అష్టాదశానా మేతేషాం ప్రత్యేకం సార్థ పుట్టికా । ఏ -
126. క : కాశ్మీరదేశీయో గాయిన్య శ్చతుర్ద్ధ శ ॥ కరడావాదనాద్యేషు కృత్యేషు రస
127. సంఖ్యయా ॥ పాచకౌ ద్వౌ ద్విజన్మానౌ చత్వార : పరిచారకాః । తథైవ షట్సమా
128. ఖ్యాతా బ్రాహ్మణా మఠసత్రయో : । చాతుర్వర్ణ్య సముద్భూతా జటిలా శ్చేడదే -

129. శజా : ॥ బీజచ్ఛేద శిరచ్ఛేద కుక్షిచ్ఛేదాదా కమ్మర్భి : । వీరభద్ర సమాఖ్యాతా దశగ్రా -
130. మస్య రక్షకా : ॥ భటాన్యు రపరే భక్తా వింశతి వ్వీరముష్టయ : । సువర్ణ్ణ తాంమ్ర
131. పాషాణవంశాయస్కుంభకారకా : ॥ ఏతే స్థపతిసంయుక్తా : కారునాపిత
132. శిల్పినః । దశ స్వకృత్యం కుర్వాణా భటాన్యు వ్వీరముష్టిభిః ॥ త్రిసప్తతి మ్మ ర్నుష్యా -
133. ణాం కల్పితా త్వేకపుట్టికా । ప్రత్యేకం పూర్వ్వ ముక్తానా మారామాత్థం చ సర్వ్వ -
134. తః ॥ ప్రాదాత్ షోడశకం భాగ న్నివర్త్తన మిత క్షితే : । గౌడదక్షిణరాఢీయపూ
135. ర్వ్వ గ్రామసముద్భవా : ॥ శ్రీవత్సగోత్రిణో యే స్యు బ్రాహ్మణా స్సామవేదిన :
136. ఏ తేభ్య స్త్రింశతం పుట్టి రదా ద్రాజగురు స్తథా ॥ ఏతా ఏతే ప్రభుంజానా
137. గ్రామ స్వాయవ్యయాదికం । అనుసందధతాం సర్వ్వం సమ్య గ్లేఖనపూ -
138. ర్వ్వకం ॥ ఇత్యాహత్య శతం సార్థం పుట్టికానాం ప్రకల్పితం । తిష్ఠతా మేవ స -
139. ర్వ్వేషాం స్వే స్వే కమ్మణి వృత్తయ : ॥ భవం త్యాచంద్రతారార్క్ మన్యథా నభవంతి వా
140. పుత్రాభావే స్త్రియో హ్యేషాం కులాచార సమన్వితాః । కారయం త్యస్వకమ్మా ర్వక్షే -
141. త్రారామాది భుంజతాం ॥ క్షేత్రాణి శిష్టా న్యఖిలాని దేవదేవాంగభోగాలయ
142. ముఖ్యకృత్యే । ఉపేయుషాం శైవతపోధనానాం కాళాననానాం శివశాసనానా -
143. ం॥ విద్యార్థ్తినాం పాశుపతవ్రతానా మ ప్యన్నవస్త్రాదిసమర్ప్పణాయ ॥ ఆ -
144. రభ్య విప్రా ననివారితానాం చండాలపర్యన్తంత ముపాగతానాం ॥ అన్న -
145. ప్రదానాయ చ సర్వ్వకాల మకల్పయ ద్రాజగురు మ్మహాత్మా । దేవస్య సత్ర -
146. స్య మఠస్య తస్య గ్రామస్య సర్వ్వస్య చ సో ధికారీ ॥ యోగోళకీ వంశ్యకృతాభిషే
147. క శ్శాంత శ్శుచి శ్శైవరహస్యవేదీ । శైవాగమానా మపి పారగామీ సంతాన -
148. పాల స్సమలోష్ట హేమా ॥ సర్వాణి భూతా న్యనుకంపమాన స్సమస్త విద్యా -
149. సుకృతావగాహా : । మహీసుర శ్శీలవతాం పురోగో భవత్తరాం నైష్ఠికదేశి -
150. కేంద్రః ॥ విశ్వేశ్వరశివాచార్య్యో ధీమా న్రాజగురు స్స్వయం । ఏసమాజ్ఞాప -

151. యద్దీర శ్శైవాచార్య్యో శతై వ్వ్రత :॥ ఆంధ్రేషు స్థానపతయ (:) షట్కర్మార్మ్మణ
స్తపోధనా :
152. సాంతానికా శ్చ సర్వ్వే త్ర సాక్షిభూతా భవంతు తే ॥ శ్రీ విశ్వేశ్వర గోళక్యా
153. మాచార్య్యత్వే ప్రతిష్ఠిత :। ఏత త్సర్వ్వం సదాచార : పరిపా ల్యోజ్ఞితం
154. సదా ॥ నిష్కాణాం శత మాచార్య్య భోగం భుంజీత దేశిక : - ఉపే -
155. క్షకేస్మి దుర్వ్ తైప్రజ్ఞా .. భక్త. క్తు.. స్తంపరిత్యజ్యపా -
156. ంతానిక మ థాపరం। ధమ్మ్ స్యైతస్య కర్తారస్స. తా.. హాయారక్షకా
157. స్తథా ॥ సర్వ్వతీర్థ్ ఫలం సర్వ్వ జపహోమఫలం తథా। సర్వ్వ దేవార్చ్ -
158. నఫలం ప్రాప్నువం త్యత్ర మానవా :॥ విరుద్ధా విఘ్నకర్తా రః క్షేత్రద్ర -
159. వ్యాపహారిణ :॥ త్రిసప్తకులజై స్సార్ధ మన్నపానాద్యభావత :॥ దరి -
160. ద్రా : ప్రేత్య రౌద్రీశ్చ ప్రాప్యాష్టా దశదుర్గ్గతీ :। దుఃఖా న్యనుభవిష్యంతి
161. మహాంతీతి మహాతపాః ॥ విశ్వేశ్వరశివాచార్య్య స్సదాచారై స్తపోధ -
162. నై :। బ్రాహ్మణై ర స్యసంఖ్యేమై గ్రోస్తే స్వభానునారవౌ। కృష్ణ వేణ్యా మ్మ -
163. హానద్యాం స్నాత్వా చమ్య విధానత :। ఏవం పాపకృతాం శాపం ప్రాదా
త్పుణ్యకృతా -
164. ం వరం ॥ కృత్వా కాళీశ్వరాఖ్యే పురే ఉపలమఠం పొన్నగామాగ్రహారం క్రీత్వా
165. విశ్వేశ్వరశివ ఉరుధీ ర్ద్ తత్రవా సర్వ్వ సాక్షి। నిర్మ్మా య స్వాఖ్యలింగ మ్మఠమపి
166. నగరే మంద్రకూటాభిధానే మానేప ల్యూట్లుపల్లి ద్వయ మదదత్త సద్దేవస -
167. త్రద్వయాయ ॥ నామ్నా స్వేన స చంద్రవల్లి నగరే లింగం ప్రతిష్ఠాప్య సన్ కించం
168. వల్లితటాకసేతుమధికం కృత్వార్థ మస్మా అదాత్। కృత్వానందపదే స్వనామనగ
169. రం ప్రతిష్ఠాప్య చాప్యానందం మునికూటమప్యథపురం దేవస్య భుక్త్యై
170. అదాత్ ॥ కొమ్మూర్మగ్రామే స్వాఖ్యలింగప్రతిష్ఠాం కృత్వా త్రింశత్ఖారిమానాం మ -
171. హీం సః। నిమ్నక్షేత్రం పంచఖారీ మితం చ ప్రాదా ద్దేవా యోంగరం గోపభు -
172. క్తై శ్రీశైలేశాన్యే లీశ్వరపురి సమఠం చ షోడశావరకం। అకరో త్తచ్ఛిష్యోదా ద్గ్రా -
173. మం గణపతి రవారిసత్రాయ ॥ విషయే పల్లినాడాఖ్యే కంద్రకోటాభిధాన -
174. కం। ఆచార్య్య దక్షిణారూపం తస్మై భక్త్యా సమార్పయత్ ॥ లింగస్నివృత్తాని -
175. మ్నాయ తద్వెల్లాలాంతరస్థలిం। దుద్యాలగ్రామసన్యాంశం పూనూరుగ్రామ -

176. మ ప్యదాత్ ॥ ఉత్తరసోమశిలాయాం లింగం వైశ్వేశ్వరం ప్రతిష్ఠాప్య ఐతప్రోల్నా -
177. మానం గ్రామం ప్రాదా త్సదేశికశ్రేష్ఠః ॥ సామాన్యో యం ధమ్మ్ సేతు నృపాణా -
178. ం కాలే కాలే పాలనీయో భవద్భిః । సర్వ్వా నేతా న్భావిన : పాత్థి వేంద్రా న్భూ -
179. యో భూయో యాచతే రామచంద్ర : ॥ స్వదత్తాం పరదత్తాం వా యో హ -
180. రేత వసుంధరాం । షష్టిం వరుషసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమి -
181. : ॥ అస్య సర్వ్వస్య ధర్మ స్య పాలకస్య పదద్వయం । విశ్వేశ్వరశివాచాయో్
వహత్యన్యా -
182. ం సహత్యలం ॥ మంగళ మహాశ్రీశ్రీ.

శాసనానుబంధము

1. చిల్పి ఆచాయ్యు్లు శాంత్తోజు కొడుకు గుడ్డోజునకు ఖ అక్కసాల భైయ్యా
2. సోజు కొడుకు ప్రోలోజునకు ఖ శ్రీమతు రాచగురుదేవర ఆనతి క్రమమున శ్రీమ-
3. తు కాశీశ్వరశివాఅయ్యంగరు సానివ్రిత్తులు పెట్టినవైయినము ॥ ప్రోలాండిసెట్టి
కుంత్తుఱు కామ్నలఅక్క -
4. సానికి ఖ తు । నల్లదేవి సెట్టి కుంత్తుఱు నలమరాసనికి ఖ తు । సమయమంత్రి
కుంత్తు -
5. ఱు విశ్వేశ్వరమాణిఖ్యానకు ఖ తు । ఆండరి కుంత్తుఱు గోళగిరిమాణిఖ్యానకు
ఖ తు ।
6. వీరభద్రవైయిరగి అండరికి ఖ తు । సంకువెన్నజియ కుమర్తెకు తు । వేమన - 53
7. బోయిని కుంతుఱు కొమసనికి ఖ తు । ప్రోలబోయ కుంతుఱు కొమసానికి
ఖ తు । త్రుట్ట
8. పాము కొమ్మసానికి ఖ తు । త్రుట్టపాము గుట్టసానికి ఖ తు । వెనసాని కూంత్తు
9. ...సానికి వ్రిత్తి ఖ న ।. డుపలెమల్లెని మనుమఱలు పాత్రలు సాని -
10. కి ఖ తు । సూయ్య దేవని కూంతుఱు తిరుముత్తసానికి ఖ న । వెలంకహుండి
11. సోమనత దేవరకు ఖ అస్థానపతి త్రిపుర .. య పిల్ల ప్రదిష్టించిన గణేవ్వరునికి న
12. శ్రీవిశ్వనతదేవరగుడి పనిచేసి కా -
13. సె అ(నో)జునకు ఖ సన్నపోజు -

14. నకు ఖ పాన్నోజునకు ఖ
15. .. ంటికూంతులు మదలమకు గోకననూం
16. .. గోకన న శ్రీవిశ్వనాథదేవర
17. ... మూందిరి కేసరి ఖ విరిగొ
18. ... సానికి కేసరి ఖ ఆకొ
(అసంపూర్తి) (SII, 395, 396)

# శివయోగి వేమన

"ఇతని సిద్ధాంతము అద్వైతము. సాధనకు హఠయోగ మూలమగు రాజయోగము" - అని రాళ్ళపల్లి, "ఇతడు రాజయోగము శ్రేష్ఠమనును. తానాచరించినది రాజయోగము కాదు శివాద్వైత మనవచ్చు"నని వంగూరి. "ఇతడు వీరశైవు డగునా" అని బండారు తమ్మయగారి సందేహం, "సామాన్య వీరశైవధర్మముల నత డంతగా పాటించక, విశేషవీరశైవము నాశ్రయించి యుండునని" ఆ సందేహానికి ఆశ్రయం. ఈ రెండింటికీ మధ్య ఉన్న భేదం రాళ్ళపల్లి వారికి అవగాహన కాలేదట. బ్రౌన్ ఏదీ నిర్ణయించుకో లేకపోయాడు. ఆ పాతచరిత్రను వదిలేస్తే వేమనది సూనృతవాదమని, లోకాయత మని, హేతువాద మని, శూన్యవాదమని, మానవతావాదమని కొన్ని వాదాలు ఇటీవల బయలుదేరాయి.

"వేయివిధము లమర వేమనపద్యంబు
లర్థ మిచ్చు వాని నరసి చూడ
చూడ జూడ గలుగు చోద్యమౌ జ్ఞానంబు" (117-374)

అని వేమన తన పద్యాలు చోద్యమైన జ్ఞానాన్ని కలుగ జేస్తాయని చెప్పాడు. ఈ మాట వాస్తవమే. పూర్వం ఇద్దరు ముగ్గురు ఏవో నాలుగు పద్యా లేరుకొని వ్యాఖ్యానాలు రాశారు. ఇప్పుడు భాష్యాలే వెలువడుతున్నాయి. సిద్ధాంత గ్రంథాలు, రాద్ధాంత గ్రంథాలు, సంక్షిప్త వ్యాఖ్యలు చాలా వచ్చాయి. ఇంకా వస్తాయట.

ఈ వ్యాసరచయిత ప్రధానోద్దేశం వేమన శివయోగి అని నిరూపించడానికి చేసిన తొలిప్రయత్నం ఇది. మలిప్రయత్నంలో ఈ విషయాన్నే కాస్త తీరుబాటుగా లోతుగా ఆలోచించి రాయాలనే జ్ఞానం ఈ వ్యాసకర్త కుంది.

**వేమన శివకవి**

శివకవి అంటే శైవులలోని కవులు. వీరు భవకవులను కీర్తించరు. బసవపురాణంలో సోమనాథుడు "శివకవి ప్రవరుల చిత్తంబు లలర" అని పూర్వకవిస్తుతి చేశాడు. "శివ కవుల్ హర్షింప చెప్పుదు కవిత" అని పండితారాధ్యచరిత్ర మొదట్లోనే పేర్కొన్నాడు. 'శివకవులు' అనే సంప్రదాయం వీరశైవులలో ఉండబట్టే, వేమన 'శివకవులకు నవకవులకు' ముందుగా వాయెత్తి స్తుతించాడు.

భవదూరుడు, శరభాంకుడు
శివశీలుడు వేయుగోటి సిద్దేశ్వరుడున్
శివభృత్యుడు వటమూలుడు
శివమయచిన్మయుడు సోమశేఖరగురుడున్.

అని శివకవులను పేరుపేరున పేర్కొన్నాడు. భాస్కర భవదూరుని ఎడపాటి ఎఱ్ఱన స్తుతించాడు. పైగా అతని పోరుమామిళ్ళ శాసనం (క్రీ.శ. 1369) తటాక నిర్మాణ శాస్త్రాన్ని చక్కగా తెలియజేస్తుంది (ఎ.ఆర్. 91/1903). (పోరుమామిళ్ళ కడప జి. బద్వేలు తా. (ఆ.క.త. 4 సం. పుట 159). ఇతని కృతులు దొరకలేదు.

శరభాంకలింగశతకం శతకవాఙ్మయంలో ప్రసిద్ధి కెక్కిన శతకం. "శ్రీ మద్యజుశ్శాఖాపస్తంబసూత్ర కౌశికగోత్రపవిత్ర వాది వీరశైవభక్తత్రయాంతర్భూతాయ ప్రతాపరుద్ర పృథివీశ్వరసంస్థానమంత్రిశేఖర శరభాంకవంశ సంభూతాయ" అని లింగధారణచంద్రిక చెబుతోంది. (ఆ.క.త. 3సం. పు. 187) "వటమూలమందిరా" అనే మకుటంతో కొన్ని పద్యాలు భారతి (సం. 13 భా. 1. పుట 3)లో అచ్చయ్యాయి. ఇతనిని కవిగా తురగా రామన, అయ్యంకి బాలసరస్వతులు నాగరఖండంలో స్తుతించారు. ఇతని పద్యాలను బట్టిచూస్తే అవి శివయోగాన్ని, తెలిపేటట్టు కనబడుతున్నాయి (ఆ. క. త. 10సం. పుట 81). మల్లికార్జున పండితారాధ్యులు, పాల్కురికి సోమన, యధావాక్కుల అన్నమయ్య, శివయోగసార కృతికర్త కొలని గణపతిదేవుడు. పిడుపర్తికవులు వీరందరూ శివకవులే. అయినా "అసలు వేమన ఇటువంటి గురుస్తుతి పద్యాలు చెప్పాడని నమ్మకం కలుగ"దట శ్రీ గోపీకి (ప్రజాకవి వేమన పుట 133).

## వేమనపేరు

వేమనపేరు వేపచెట్టుకి ముడిగట్టారు - బండారు తమ్మయ్య, ఒంగోలు వెంకటరంగయ్య. ఈయన పేరు వెంకట సుబ్బయ్య అంటారు గోపి (ప్ర.వే. పు.108). బ్రౌన్ సంస్కృత నిఘంటువు చూసి వేమ అంటే లూమ్ (మగ్గం) అనే అర్థం చెప్పాడు. వేమ శబ్దం వ్యోమ శబ్దతద్భవం అని కిట్టెల్ కన్నడ నిఘంటు.

"విశ్వం వ్యయతి సంవృణోతీతి వ్యోమ" - విశ్వమును వ్యాపించునది అని అమరం. విశ్వదాభిరాముడు వేమన.

వేమన రెడ్డి కులస్థుడు అనటానికి ఇష్టంలేనట్లు. "వేమన యోగమార్గావలంబి. పేరే వేమనయోగి స్థిరపడినది కదా - విశ్వరూప సందర్శన యోగం అతని నిలుకడ కడపట రాజయోగము నందే యున్న." (వి. -3-13) దని తెలిపిన వారే వేమన "రైతు బిడ్డ" అని రాయటం సమర్థవంతంగా లేదు. వేమన శివయోగి. "శూరుల జన్మంబు సురల జన్మంబు" లాగే వేమన జాతకం చెప్పలేం. అసలు వేమన్న అనే వ్యక్తి ఉన్నాడా అని కొందరు పెద్దలు-వేమన్నపద్యాలు చదివినవారే అన్నారు. కవిస్తుతులలో వేమన్నని కీర్తించారు కాబట్టి అటువంటి వ్యక్తి లేకుండా పోడని మరొకరి సర్దుబాటు.

### వేమనకులం

వేమన రెడ్డికులం వాడని రెడ్లు ఆదరించి ఉత్సవాలు చేసేవారు. 60 ఏళ్ళ క్రితం ఆంధ్రపత్రిక ఎన్నో వార్తలు ప్రచురించింది. ఎడ్డెరెడ్డికుల మని వేమనపద్యంలో ఉంది. కలియుగంలోని కాపుకులానికి వేమన తన కీర్తి విక్రయించేడని అతనే మరో పద్యంలో చెప్పుకున్నాడు. బ్రౌన్‌కి అనుమానం ఎందుకొచ్చిందోకాని వేమన బ్రాహ్మణుడు కాడని రాశాడు. జంగముడని ఒక చోట, రెండూ కాదని ఒక చోట, కాపు లేదా రైతు అని వేరొకచోట, అనవేమారెడ్డి కుటుంబానికి చెందినవాడని మరోచోట రాసి - ఏదీ నిర్ణయించుకో లేక పోయాడు. "కాబట్టి వేమన తెగని నిర్ణయంచడం కష్టం" అని చెబుతూ "ఏ తెగకు చెందినప్పటికీ వేమన బండారు తమ్మయ్యగారు భావించినట్లు రైతు కుటుంబానికి చెందినవాడు" అనే నిర్ణయాని కొచ్చారు గోపి (ప్ర.వే. 107). ఇకపోతే వేమన సాలెకులం వాడని ఎవరన్నారోకాని "విశ్వరూప సందర్శన యోగం" అనే చిన్న పుస్తకంలో శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు బట్టల పరిశ్రమ, చరిత్రతోబాటు కాపిటలిజం, సోషలిజం, మార్క్సిజం చెప్పి విశ్వరూపం చూపెట్టి ఆవాదాన్ని ఖండించారు. వి3-180వ పుటలో తిరిగి వారే ఆ విషయాన్ని ఎత్తుకుని "వేమన (నేటి) రెడ్డికులస్థుడే కావచ్చును. అయినను ఆది నిరూపణము నింకను నపేక్షించుచున్నది. ఇప్పటికి సంపాదించిన ఆధారములు నిర్ణాయకములుగావు. ఇంక నీ విషయమున పరిశోధన జరుగవలసియే యున్నది. అంతవరకే యీచర్చ ఉద్దేశము. ఇప్పటి కాతడు రైతుబిడ్డ-అది తిరుగులేనిమాట" అని శుద్ధగ్రాంథికంలో విష్కర్షచేశారు. గ్రంథానికి వేంకటేశ్వరరావుగారు వ్యవహారిక భాషలో రాసిన ప్రస్తావన. గోపీ, త్రి.వే. రా.లు ఒకే అభిప్రాయానికి రావడం మెచ్చుకో తగిందేకాని

ఈ విషయంలో ఏదీ చెప్పక ఇద్దరూ చల్లగా జారిపోయారని అనిపిస్తుంది. కులం నిరూపించలేకపోతే రైతుబిడ్డ అంటే కుదరదు. రైతుబిడ్డలు కులంలేని వాళ్ళా? ప్రతీ రైతుకి కులం ఉంటుంది. ఉండి తీరుతుంది. ఇదీ తిరుగులేని మాటే.'' ధ్వని మనకు దొడ్డ సిద్ధాంతము'' (వి3-138). వేమన్నను ప్రపంచపౌరులు ముందు పెట్టడానికి చేసే ప్రయత్నం మంచిదేకాని, విశ్వదాభిరాముడి సూక్తులు వ్యాఖ్యానం చేసేపట్ల పెద్దలు కించిత్ సమాలోచనా చిత్తులై ఉంటే మంచిది.

Therefore it thine enemy hunger,
feed him, if he thirst, give him drink;
for in so doing thou shalt heap coals
of fire on his head. (Romors 12:20)

"చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు సేయరాదు
పొసగమేలు చేసి పొమ్మనుటే చావు''

ఈ "విశ్వదాభిరామునిసూక్తి''కి మూలం బైబిలులోనే కనబడుతూ ఉండగా దానికి ఏవేవో వ్యాఖ్యానాలు. "ఇంతటి ఉన్నతమైన ధర్మాన్ని ఏమతాలు బోధించాయి' ' అని ప్ర.వే. (245పు)లో ప్రశ్నిస్తారు గోపి. "బైబిలులోని దేవునివంటి దేవు డాతనికి లేడు. అందుచే ఆగ్రంథములు చెప్పిన చొప్పున ఇతడు చెప్ప'' లేదని రాస్తారు శ్రీ త్రిపురనేనివారు.

**శాసనంలో వేమన : కాలం**

కడప జి. సిద్ధవటం తా. ఓబళం మాలకొండేశ్వర దేవాలయం బండ మీద చెక్కిన శాసనం.

1. శ్రీమన్ మహామనోకొండేశ్వర వ
2. ర తల్లి అంకాళాది శక్తి దేవాల-
3. య ఆస్థాన మండపము మ
4. ధ్య వివాహోత్సవములున్ను
5. బాలులకు పుట్టు వెంట్రు
6. కల తీయించేవారున్ను శ

7. వార్పణంబని యిహాలు
8. సాధింపను (వా) మవిద్యయె విద్య
9. పరము సాధింపను బ్రం॥ అ
10. ని(రి)తలచెరు॥ ప్రకారం తప
11. క అచె౯కుని వశంలో యివ్వసకలా
12. ధ్ మధి(స్క)రం - ను అనబ్రంహ్మ
13. పరణంబునం చె--

(Inscriptions of Andhra Pradesh. Cuddapah Dt. Part III. No. 237 (No. 375 of 1967). Edited by Sri P.V. Parabrahma Sastry Govt of AP. 1981)

ఇందులో క్రీగీటులునావి. ఆపాదాలు పూర్తిగా వేమన పద్యసూక్తిరత్నాకరము (1913) రాయవరపు వారి అచ్చు ప్రతిలో

"ఇహమున సుఖియింప హేమతారక విద్య
పరము సుఖియింప బ్రహ్మవిద్య
కడమ విద్యలెల్ల కల్గె మూఢుల కెరా
విశ్వదాభిరామ వినురవేమ" అని కనబడతాయి.

ఈ శాసన కాలం 17 వ శతాబ్దమని పరిష్కర్తల అంచనా.

1. శాసనాలో వేమన పద్యం వాడటం ఇది మొదటి సారి కావచ్చు. గుర్తించడం కూడా మొదటి సారే.
2. ధర్మప్రామాణ్యానికి వేమనపద్యం చూపటం వల్ల పద్యాలకు కడపజిల్లా ప్రజల్లో ఎంత ప్రచారం ఉందో తెలుస్తుంది.
3. వేమన కడపజిల్లావాడని గట్టిగా చెప్పొచ్చు.

కడప జి. తా. చినదర్శిపల్లి నరసింహదేవాలయంలో బండమీద చెక్కబడిన 1533 నాటి అచ్యుతదేవ రాయల శాసనంలో కార్యకర్త బాచరసుంగారు, తాళ్లపాక తిరుమలయ్యంగారి అనతిని ధర్మశాసనం వేయించాడు. వేమన బాచరసును పేర్కొన్నాడు. తాళ్లపాక తిరుమలాచార్యుడు రాసిన నీతి సీసశతకంలోని

*"పదుగు రాడిన మాట పాటియై ధరజెల్లు*
*నొక్క డాడినమాట యెక్కదెందు. (63)"*

అనే రెండుపాదాలను వేమన యధాతథంగా వాడుకున్నాడు (చూ. బ్రౌన్ 1839 ఎడిషన్ 68 వ పుట).

దీనిని బట్టి వేమన 1550-1620 మధ్య జీవించి ఉంటాడని చెప్పవచ్చు.

## వేమన - శివయోగం

యోగం నాల్గు విధాలు. మంత్ర, లయ, హఠ, రాజయోగాలని ఈ నాల్గింటిని యోగశాస్త్రవేత్తలు, వ్యాఖ్యాతలు రాస్తూ ఉంటారు.

మంత్రాన్ని, ముఖ్యంగా పంచాక్షరిని నిర్విరామంగా జపించేవారు మంత్రయోగులు. చిత్తాన్ని ప్రపంచవ్యాపారం నుండి మరలించి అనావృత మహానాదంలో గాని, తాను ధ్యానింప దలచిన స్థలంలో గాని మనస్సుని వాయుమనోయుతంగా లీనం చేసే వారు లయయోగులు.

ఆసన, బంధ, కరణ, ముద్రాభ్యాసంవల్లకాని, కేవల కుంభకమార్గాన్న గాని ఎవనికి వాయువు స్వాధీనమవుతుందో అతడు హఠయోగి. మంత్ర, లయ, హఠయోగాల ద్వారా ఎవరికి బ్రహ్మసాక్షాత్కారం కలుగుతుందో వారు రాజయోగులు.

ఈ రాజయోగం మళ్ళీ మూడు విధాలు. సాంఖ్యం, తారకం, అమనస్కం. 25 తత్వాల నిజతత్వం తెలుసుకోవటం సాంఖ్యం, బాహ్యముద్రాజ్ఞానం తారకం, అంతర్ముద్ర అమనస్కం. రాజయోగం అనే శిఖరం చేరడానికి హఠయోగం నిచ్చెన. హఠయోగం కష్టం కదా అని వదిలివేస్తే రాజయోగం ఫలించదు. యోగాలకు రాజువంటిది రాజయోగం.

## వేమన పద్యాలలో రాజయోగం

*"మదిలోనిది రాజయోగ మహిమము వేమా"!*
*రాజయోగీంద్రు డాతడె తేజరిల్లు.*
*తాను నింద్రియముల దనర జయించిన*
*తత్వ మరసి చూడ దాన యగును*
*రాజయోగి యిట్లు తేజరిల్లుచు నుండు"*

ఇంకా ఎన్నో పద్యాలు ఉన్నాయి.

## తారకయోగం

"తారకంబు జూచు దారి వేరే కల్దు

సమముగా జూడ చక్కబడును
వెర్రిగాను జూడ వెలుగెల్లి పారురా
ధర్మమే నృపులకు తారకయోగంబు
తన్ను జూడ జూడ తారకబ్రహ్మంబు
తలపుచేత గల్గు తారకబ్రహ్మంబు
తనువు దానగుట యోగి తారకమాత్మన్
తను యనుచు పరిణమించిన".

వేమన పద్యాలలో ఎక్కువగా కన్పించేది యోగ విషయమే. యోగాంతర్గతాలయిన కామక్రోధాదులు, తీర్థయాత్రలు, విగ్రహారాధనని ఖండిస్తూ మొదలయిన వాటి వేమన యధేచ్ఛగా పద్యాలు చెప్పుకుంటూ పోయాడు. అవి అవహేళనతోను, విమర్శతోను నిండి ఉంటాయి. వేమన జంగం అనే భ్రాంతిని కలిగించే వీరశైవ, శివయోగ పారిభాషిక పదాలతో కూడిన వేమన పద్యాలే.

**ఆత్మలింగ పూజ**

"వివరనవక మెల్ల వెలిమూసి వాయువుల్
మనసుతోన గూర్చి మర్మమెరిగి
యాత్మలింగ పూజ నంటిన ముక్తిరా

బందె త్రాళ్ళ దెచ్చి బంధించి కట్టంగ
లింగడేమి దొంగిలించినాడొ
యాత్మలింగమేల నర్చించి చూడరో"

ఆత్మలింగం అంటే -

"పరమ మానందరూపంబు బ్రహ్మం బని
యేమూర్తి జెప్పుదు రెల్ల బుధులు
ఐశ్వర్యమహిమకై యాబ్రహ్మ విష్ణ్వాదు
లర్చింతు రేమూర్తి నహరహంబు
మంత్ర, లయ, హఠ సమాన రాజప్రౌఢి
నొందుదు రేమూర్తి యోగివరులు

తెలియంగ లింగమందే జగత్సర్వమన్
ఘనత యేమూర్తికి గలిగియుండు
నట్టి యాదిమధ్యాంతశూన్యైకవర్తి
కలిత వేదాంతశాస్త్ర విఖ్యాతమూర్తి
నద్వయ జ్ఞానమయ పరమాత్మమూర్తి
శ్రీమహాలింగమూర్తి గీర్తింతు నెపుడు''
(కొలని గణపతి శివయోగసారం 1-9)

ఆత్మలింగం అనేది శిలా లింగంకాదు. సమాసార్థం ప్రకారం చేతిలోను, ఎదను గట్టిగా దాచుకొనేది కాదు. అది నల్లని మేఘాల మధ్య మెరుపు (నీలతో యద/ మధ్యస్థా విద్యుల్లేఖే వభాస్వరా) సర్వభూతస్వరూపం, ధాన్యపుగింజమొనకంటె సూక్ష్మాతి సూక్ష్మం. శివయోగుల కిది శివస్వరూపంగా సాక్షాత్కరిస్తుంది. జ్యోతికలిక అన్నా ఇదే. బ్రహ్మం అన్నా ఇదే.

పండితారాధ్యులవారు శివతత్త్వసారంలో "ఒడలు గుడి'' అన్నా, వేమన్న తనువు గుడి అని చెప్పినా శరీరాన్ని ఆలయంగా చేసి అందులో ఆత్మలింగసాక్షాత్కారం పొందటం.

**విగ్రహాలు - పూజ**

"జలమయములు తీర్థములని
శిల మృద్వాదికములును విశిష్టామరు లం
చిల వాని నొల్లరు నియతా
త్ములు శివు డాత్మన్నిజముగ దోచిన పిదపన్
అల్పజ్ఞానులు కొఱకుం
గల్పించిన ప్రతిమలందు గన నొల్లరు సం
కల్పవరులు యోగీంద్రు ల
నల్ప మహిమ జెలగు శివుని నాత్మనె తక్కన్.
(శివ. సారం 1-24, 25).

ఈ భావాన్నే వేమన తిరిగి మరోసారి చెప్పాడు.

"శిలను ప్రతిమ జేసి చీకటింటను బెట్టి

ౘ్రొక్కవలదు వెఱ్ఱిమూఢులార
యుల్లమందు బ్రహ్మయుండుట దెలియదు

గట్లు రాళ్ళు దెచ్చి కాళ్ళు చేతుల ద్రొక్కి
కాసె యులెల చేత గాసి జేసి
మొరపరాళ్ళ కెరగు మొప్పెల నేమందు".

ఇటువంటి భావాలున్న పద్యాలను చర్విత చరణంగా చెప్పటం వేమనకు పరిపాటి.

**కులం**

"కులము గలవా రెచట ము
క్తులైరి కులహీనులెల్ల మది నెచటను ము
క్తులుగారె యోగిజను లే
కులజులు గా కితరు లేటి కులజులు తలపన్. (శివ. సారం. 2-91)

కులం కన్నా గుణం ప్రధాన మని, కలిమి ప్రధానమని, మాలమాదిగలను తక్కువగా చూడరాదని శివయోగుల భావం. సర్వసంగపరిత్యాగి అయిన శివయోగికి వీటితో ప్రసక్తే లేదు.

**తీర్థయాత్రలు**

"ఈక్షితి కాశీక్షేత్ర కు
రుక్షేత్రము లాదిగా నిరూఢములగు పు
ణ్యక్షేత్రములకు నరుగ న
పేక్షింపు దురాత్ములు తీర్థ మెరుగని వారల్"

"తా నెచటి కేగినను మరి తానె కాక
యితరుడగ నేర్చునే జను డేవిధముగ
బుద్ధి జూడంగ భారంబు శుద్ధమైన
నఖిలతీర్థంబులును దనయంద లేవె"
"అరయ నిట్ల యగుట యాత్మతీర్థము విస
ర్జించి బాహ్యతీర్థసేవ సేయ

గోరి బ్రమసి తిరుగు కుమతుల నేమన
గలరు దీనిఁ దెలియ వలదె బుధులు" (శివ.సారం. 2-147,151,155)

"రమణన్ భక్త సమగ్ర దర్శనము తీర్థశ్రేణి, తద్గోష్ఠి తీర్థము, తద్దివ్యదయావలోకము తీర్థం బెన్నగా నిట్టి జంగమతీర్థాంబుధి నోల లాడక వివేకభ్రష్టులై పోయి లోకమునం దీర్థము లంచు నేరులు సారంగా నేల సర్వేశ్వరా!

(అన్నమయ్య-సర్వేశ్వర శతకము 24.)

ప్రాచీనశివకవులు పైవిధంగా చెప్పిన పద్యాలలోని భావాలనే వేమన పదే పదే చెప్పాడు. అతడు కొత్తగా చెబుతున్నాడని కాదు కాని, తను నమ్మిన దానిని గట్టిగా ప్రకటించాడు. ఈ క్రింది వేమనపద్యాలు ఆకోవ లోనివే.

"తిరుమలకు బోవ తురక దాసరిగాడు
కాశిబోక లంజ గంతకాదు
కుక్క సింహ మగునె గోదావరికి బోవ

కాశి కాశి యనుచు కడు వేడ్కతో బోదు
రందు గలుగు దేవు డిందు లేడె
యిందు నందు గలడు హృదయంబు లెస్సైన

కాశి, మధుర, కాంచి, గయ, ప్రయాగము పేతు
వాస తోడ వీటి నాత్మ జూచి
వాసనను దెలియడు వట్టి వెట్టి విధంబు"

**వేమన పద్యసంఖ్య**

వేమన వేయిపద్యాలు రాసినట్లు చెప్పుకున్నాడు.

"శ్రీకర శివతత్వశీలుడు వేమన
ప్రాకటమగు వేయిపద్యములను

వేయి పద్యముల వివేకియై భక్తితో
పఠన జేసినట్టి"

"ముద్రితాముద్రితప్రతులలోని పద్యాలను లెక్కగట్టి, బ్రౌన్ సేకరించిన ప్రతులలో వేయి పద్యాలకు మించి ఉన్న ప్రతులు చాలా తక్కువ" అని డాక్టరు గోపి

తమ సిద్ధాంత గ్రంథంలో (ప్ర.వే.19 వ పుట) రాశారు. ప్రతి నెంబరు 1735 లో 1116 పద్యాలున్నాయని ఇన్ని పద్యాలు ఏతాళ ప్రతిలోని పద్య సంఖ్య వేయిని మించి ఉండదని కంఠోక్తిగా ఆయన ఉద్ఘాటించారు.

డాక్టరు గోపీ చెప్పింది, వేమన చెప్పుకొన్నది చక్కగా అమరాయి. ఆ తరవాత తుక్కూ దూగర ఏకి టాకాలు గట్టిగా వేసే దూదేకులు దొరికితేగాని వేమన పద్యసంఖ్య నిక్కచ్చిగా కుదించలేం.

"వేమన పద్యాల్లో పూర్వకవి అనుకరణలు

1839 నాటి వేమన పద్యాల ముద్రణ పరిశీలిస్తే పూర్వకవికృతాలు కొన్ని కనబడతాయి.

"పదుగు రాడు మాట పాటియై ధర జెల్లు
నొక్క డాడు మాట యెక్క దెందు
నూర కుండు వాని మాట కూరెల్ల నోపదో"

అనే పద్యం బ్రౌను 1839 ఎడిషన్‌లో (68వ పుట) నమోదయింది. ఇది తాళ్ళపాక పెదతిరుమలాచార్యుని నీతిసీసపద్యశతకంలో ఉండే

"పదుగు రాడిన మాట పాటియై ధరజెల్లు
నొక్క డాడినమాట యెక్కదెందు
నుఱక యుండిన వాని కూరెల్ల నోపదు (63)

అనే భాగమే కదా! సాహిత్య అకాడమీ అచ్చు వేసిన సుమతీ శతకంలోని ఈ క్రింది కంద పద్యాలు 1839 బ్రౌన్ ఎడిషన్‌లో కనిపిస్తున్నాయి. పరనారీగమనుండై (8-5), వినవలె నెవ్వరు చెప్పిన (21-143) యెవ్వరితోడను (32-212), వెలయాలి వలన కూరిమి (77) పేదరిక మంత (84-152), రతిలేక ముదియు (97) వెయ్యారుగతులు (19-391).

సాహిత్యఅకాడమీ బ్రౌన్ వేమనపద్యాల పరిష్కరణను విమర్శించిన బంగోరె యోగి వేమన తెలుగు విజ్ఞాన కేంద్రం ద్వారా బయటపెట్టిన 1834 నాటి ముద్రణలో చేరిన పై సుమతీ శతక పద్యాల సంగతే ఎత్తుకోలేదు. ఒక్క సుమతీశతకమేకాదు. ఈ కింది అనుభవసార పద్యాలు కూడా 1839 బ్రౌన్ ముద్రణలో దూరిపోయేయి. అనుభవసారం పాల్కురికి సోమన కృతి.

"ఇంద్రియపరవశు డధముం
డింద్రియనిగ్రహుఁడు భక్తియెడ మధ్యముఁడౌ
నింద్రియజయుఁ డుత్తముఁడు శి
వేంద్రియ సంధాయకుఁడు మహేఁశుడు కాడే ?

నిత్యంబు గాని యొడలికిఁ
బ్రత్యహమును బెద్ద దుఃఖపడవలె నన్నన్
నిత్యపదం బగు భక్తికి
నత్యంతము దుఃఖపడక యగునె మహాత్మా !"

వీటికి చివర "వేమా" అనే సంబోధన చేర్చి చదువుతే వేమన పద్యా లవుతాయి.

"పరుల దత్తమిట్లు పాలన చేసిన
నిల్వ స్వదత్తమునకు నినుమడించు
నవని పరుల దత్త మపహరించిన స్వద
త్తంబు నిష్ఫలంబు ధరణి వేమ" (80-125)

ఈ పద్యం ఈ క్రింది భూమిదాన శ్లోకానికి అనువాదం.

స్వదత్తా ద్విగుణం పుణ్యం
పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ
స్వదత్తం నిష్ఫలం భవేత్

తనదుదాన మవని తనకూతురి సమంబు
తండ్రిదాన మెల్ల దనకు తోడు
అన్యు లిచ్చు దాన మది తల్లి"
ఈపద్యానికి మూలం
స్వదత్తా పుత్రికా ధాత్రి
పితృర్ దత్తా సహోదరీ

అన్యదత్తా స్వమాతాచ
దత్తా భూమీం పరిత్యజేత్.
ఈ శ్లోకాలు సాధారణంగా భూదానశాసనాంతాల్లో గోచరిస్తాయి.

"వేస మరసి చూడ గ్రాసంబు కొరకయా"
ఉదర నిమిత్తం బహుకృత వేషః (భజగోవింద శ్లోకపాదం)
"పరగ రాయనికులు బాచన్న ధనమెల్ల"

ఇది చాటు పద్యమణిమంజరి ప్రథమ భాగంలో 85 పుటలో ఉంది.

ఈ విధంగా బ్రౌన్ఎడిషన్ లోనివి, అకాడమీవారి ఎడిషన్‌లోనివి ముందు ఏరిపారేస్తే తరవాత ఇతర ముద్రిత ప్రతులను పరిశీలించవచ్చు.

డి.1723 ప్రతిలోనిదని డాక్టరు గోపీ చూపిన

"గట్టిగ నార్గురేడ్గురిని" అనే మార్పుతో "వటమూలమందిరా" శతకంలో ఉంది.

దేశవిదేశాల్లోని వేమన ముద్రితాముద్రిత ప్రతులను సేకరించి సాధికారపరిశోధిత గ్రంథం వెలువడితేకాని వేమన్న నిజస్వరూపం బహిర్గతం కాదు.

## వెర్రి వేమన

వేమన్న కీవిశేషణం తను పెట్టుకొన్నదే. ఆకారచిత్రణలో కూడా వేమన్న వెర్రివాడు లాగే కనిపిస్తాడు.

"చెరచి మరచినట్లు చేష్టలు చెడి యెద్దీ
యైన గుడిచి యెద్దియైన గట్టి
యెచటనైన దిరిగి యెచ్చోటనైనను
నుండు నతడు రాజయోగివరుడు"
(శివ యోగ సారం. 4-294)

చెరుపు మరుపు మాటలాడుతూ పిచ్చిచేష్టలు చేస్తూ ఎవరెంత పెడితే తిని, ఏ గుడ్డముక్కో కట్టుకొని రికామీగా తిరుగుతూ, ఇష్టమొచ్చినచోట నివసిస్తూ ఉండేవాడు రాజయోగి, వెర్రివేమన్నలోని వెర్రికి ఇదే అర్థం.

## వేమన బొమ్మ

అచ్చుబడ్డ వేమన బొమ్మచూస్తే నిజంగా వెర్రివాడి లాగే కనబడతాడు. ఒకటి, రెండు చిత్రాలు తప్ప ఈ క్రింది రేఖాచిత్రం అందరికీ బాగా పరిచయమైంది.

ఇట్లాగే వేమన కూర్చోడానికి కారణం ఏదో ఉండాలి హఠయోగప్రదీపిక అద్వైతయోగం చెబుతుంది. అందులో చెప్పిన ఆసనంకాదాయె ! మళ్ళీ శివయోగసారమే దిక్కయింది వేమన సుఖాసనాసీనుడై ఉన్నాడు



"తన కెట్లుండిన సుఖమై, యనవరతాభ్యాసమునకు ననుకూలంబై
తనరారునది సుఖాసన, మనదగు శివయోగి జనసమాశ్రయ మగుచున్.

చిత్తమంతస్థమై యుండ జేసి బాహ్య, దృష్టి నియమించి తనకు నభీష్టమైన
యాసనంబున నుండి కాయంబు వక్ర, ముగ నొనర్చిన నిది ధ్యానముద్ర విధము(3-207)

ఈ ముద్రయందు నాత్మ న, నామయు సర్వగుణు శాంతు నవిచలు నద్వై
తామేయమూర్తి బరశివు, డా మది జింతించు నతడ తగుముక్తు డిలన్(3-208)

ఆసన మనదగు నిష్ఠ సు, ఖాసనమున సంతతంబు నాత్మకృతి యం
దాసన్నత్వము సర్వో, దాసీనత గలిగియున్న తలపును జగతిన్ (4-9)

వేమన సుఖాసీనుడై ధ్యానముద్రలో సర్వోదాసీన భావంతో కూర్చున్నాడనే మనం భావించాలి.

## అల్లమ ప్రభువు - శూన్యవాదం

"వీరశైవులకు తెలుగున తలకట్టు పాలుకురికి సోమన్న. వీరశైవమున శూన్యవాద మున్నదని అని తెలియనే తెలియదు. అల్లమప్రభుని గూర్చి చెప్పునప్పు డైన "ద్వైతయోగ క్రియాద్వైత యోగక్రియాతీత యోగ క్రియా న్వితుడని" యన్నాడేకాని అక్క డాతడు ద్వైతా ద్వైతయోగముల కతీతమైన యోగ మనగా విశిష్టాద్వైత యోగమని కూడ భ్రమపడి యుండవచ్చును. "శూన్యవాది" యని యయిన వ్రాయలేకపోయినాడు." (వి3-పు.2)

"అంతర యాగ నిరంతర యోగ
వంతు డనంత వేదాంతవేద్యుండు
నిశ్శరీరి శరీరి నిర్నామి నామి
నిశ్శబ్ద శబ్ది వినిర్భావి భావి
ముట్టిన బయలైన మూర్తి సేవానగ"

అని బసవపురాణం లోను, ద్వితీయాశ్వాసం

"రతి లింగబాహ్యాత్పరం నాస్తి యన బాహ్యాశూన్యంబ యది యథాశూన్యమనుచు" అని చతుర్వేదసారంలోను, అల్లమప్రభుని శూన్యవాదాన్ని గురించి చెప్పబడింది.

"తెనుగున నవనాథ చరిత్ర (గౌరనకృతము) యీ మతమునకు చెందినది. కాని అందులో ఆమత సిద్ధాంత విశేషములు పూజ్యము. ప్రాణము లేని కట్టెగా నాథమతము ఆ రచనలో దొరుకుచున్నది. అంతే. ఆమతములో యీ సహజ శూన్యత ఎక్కినది" (వి-3-6) సహజశూన్యత అంటే ఏమిటో? వేమనకు నాథ సిద్ధులతో సంబంధమున్నదట! బ్రహ్మగుడ్డు అనే పద్యం శివయోగానికి చెందిందిగాని బౌద్ధమతంలోని మాధ్యమిక శూన్యవాదానికి చెందిందికాదు. రేవణుడు నవనాథులలో లేడు మరుళ, ఏకోరామ సిద్ధత్రయంలోని వాడు.

అల్లరుప్రభుదేవర శ్రీశైలంలో గోరక్షకుని కలుసుకోవడం ప్రభులింగలీలలో ఉందంటే అంతకు ముందు నవనాథచరిత్రలో గోరక్ష అల్లమప్రభువుల సమాగమం ఏమ్మయి నట్లా?

అసలు రాజయోగ హఠయోగ రహస్యాలు ఎందుట చెప్పాలి. నవనాథసిద్ధులు హఠయోగులు. అల్లమప్రభువు కూడా అంతే. పైగా శివయోగి.

"అల్లమ ప్రభుదేవశ్చ ఘోడా చోలీచ టింటిణియః " అని హఠయోగ ప్రదీపకలో (1-6) అల్లమ ప్రభువు హఠయోగిగా పేర్కొబడింది.

"హఠ విద్యాపరం గోప్యా యోగినా సిద్ధి మిచ్ఛతా
భవేద్వీర్యవతీ గుప్తా నిర్వీర్యాతు ప్రకాశితా" (1-11)

గుప్తంగా ఆ రహస్యం ఉంచకపోతే సాధకులు ఏదీ సాధించలేరు.

అందువల్ల గౌరనలోని సిద్ధులు హఠయోగరహస్యాలను వెల్లడించలేదు. స్థూలంగా కొన్ని రాజయోగరహస్యాలు గౌరన తెలిపాడు.

బౌద్ధంలో శాశ్వతత్వానికి ఉచ్ఛేవాదానికి మధ్య ఒక తాత్త్వికస్థితిని అవలంబించినవారు మాధ్యమికులు. ద్వైతు లయిన వైభాషికులకి బాహ్యా-అంతర ప్రపంచాలు రెండూ యథార్థాలే. ఈ యథార్థాన్ని భావాల నాధారంగా చేసుకొని తర్కించ లేకపోతే వ్యర్థమని సౌత్రాంతికులు భావానుమేయవాదాన్ని ప్రతిపాదించారు. యోగాచార్యులు బాహ్యప్రపంచాన్ని భ్రమగా నిరూపించి, భావాలను యథార్థంగా మానసాధీనం చేసుకొన్నారు. వీరిది ఆత్మాశ్రయభావవాదం. భావం-పదార్థం అవినాభావా లయినప్పుడు, వాటిలో పదార్థం భ్రమ అయినప్పుడు భావంకూడా భ్రమ కావలిసిందే. అప్పుడు అంతా శూన్యమే అని మాధ్యమికులు ప్రతిపాదించారు. శూన్యం దృగ్విషయ ప్రపంచాతీతమైన యథార్థాన్ని, పారమార్థికసత్యాన్ని ప్రతిపాదిస్తుంది. లౌకిక ప్రపంచాన్ని, లౌకికానుభవాలను మాధ్యమికులు కాదనలేదు. అయితే అవి పరమార్థాలు కావు వారికి.

వేమన్నది మతరాహిత్యమైన దృష్టి అని, ఆదృష్టి నాగార్జునుల శూన్యవాదంతో సాధించవచ్చునని వి-3 వాదం. వేమన్నది మతరాహిత్య దృష్టి అని భావించడం అతని తాత్త్వక చింతను గణనలోకి తీసుకోకపోవడమే. కారణం వేమన్నది నిరీశ్వర సిద్ధాంతమని నిరీశ్వరవాదులు భ్రమపడటంలో పొరబాటు లేదు. కాని అతని పద్యాలలో సగానికి పైగా శివస్మరణే కనబడుతున్నప్పుడు వాటిని విస్మరించడానికి బలమైన సమర్థన కావాలి. ఆపద్యాలు స్మరించినా, ముట్టుకున్నా మహాపాపం అన్నట్లు వాదన కుపక్రమిస్తే ఆ వాదన పేక మేడలా కూలిపోక తప్పదు. ఏ పద్యాలు వేమనవో, ఏవి కావో నిర్ణయం కానప్పుడు, నకిలీ పద్యాలు ఆధారంగా చేసుకొని వాదాన్ని నడిపే ప్రమాదం వస్తుంది. వేమన చెప్పినట్లు ఆది చోద్యమైన జ్ఞానం అవుతుంది. వేమన్న ఆర్థికప్రస్థానంకన్నా

అతనిలో యోగలక్షణాలు, అందులో ముఖ్యంగా శివయోగి స్వరూపం గోచరిస్తుంది. అదికాదని బుజువైననాడు మాధ్యమిక శూన్యవాదాన్ని, ఆర్థిక ప్రస్తావనను అంగీకరించడానికి ఎవరికీ అభ్యంతరం ఉండదు.

## అల్లమప్రభువు-శూన్యవాదం దేశాయిగారి తీర్పు

Sunya - This is described by the Buddhists as Sunya and Nirvana. The Virasaivas call it Bayalu or Nirbayalu. But the two concepts are divergent and their contrast is distinct. The former is negative and the latter is positive. Sunya in Buddhism means extinction and non-entity. Sunya of Virasaivism is an entirely different, grand, and sublime entity. This sunya is here equated with Siva, the infinite and supreme soul. It is reminiscent of the upanishadic Brahman. (Sunya Sampadane Vol.1, Karnataka University Publication. Preface P. VIII (1965))

There is no Comparison of Virasaivism which is positive, zealously theistic and robustly optimistic with Buddhism which is negative, atheistic and pessimistic.

Basaveswara and his Times - Dr. P.B. Desai (1968, Page 325).

దేశాయిగారు బౌద్ధశూన్యవాదానికి, వీరశైవ (అల్లమ) శూన్యవాదానికి ఏవిధంగా పోలికలేదని చెప్పారు. నిరీశ్వరశూన్యవాదానికి, సేశ్వరశూన్యానికి పొత్తుకుదరదు. పండితారాధ్యుడు చందవోలు వెలనాటిచోడుని ఆస్థానంలో ఇతర సమయవాదులను ఎదుర్కొని చేసిన సవాళ్ళలో......

బౌద్ధుండ వినుము నీ బౌద్ధంబు శ్రుతి వి
రుద్ధంబు, భవపాశబద్ధంబు, భువి ని
షిద్ధంబు, దుఃఖ సమృద్ధంబు, పాప

బద్ధంబు, మున్న యబద్ధము - యని మొదలు పెట్టి శూన్యవాదం గురించి ఎత్తుకొని

తివిరి యుత్పత్తి స్థితి విలయ హేతు
వవునె దైవము శూన్య మయ్యె నేనియును
దెలియ నుత్పత్తి స్థితి విలయహేతు
విల గాని యది దైవ మెట్లును గాదు
దలపోయ శూన్యతత్త్వముగల యదియె ?

తలపోయ శూన్యతత్త్వము లేని యదియె ?
కలదేని శూన్యంబు గా దశూన్యంబు
గలుగదేన్ శూన్యంబు గలుగ దెట్లనిన
గలదేని శూన్యమన్ పలుకు దా బొంకు
గాన యహింసావిహీనులు, సత్య
హీనులు, గ్రియాఫలహీనులు, గర్మ
హీనులు, నిజ దైవహీనులు, పుణ్య
హీనులునగు బౌద్ధజైనాదులకును
గలుగునే మోక్ష వికస్వర సుఖము (వాద ప్ర.)

"మానవుని నిత్యజీవితము నందు దుఃఖనివృత్తి సుఖప్రాప్తికిని దైవసందర్శనము పరమసాధనగ నున్నది. జైనబౌద్ధమతములు సంసారము దుఃఖమయ మనియును, సన్న్యాసము సుఖసాధన మనియు నుపదేశించినవి. అద్వైతము సంసారము మాయా కల్పితమని యుపదేశించినది. పండితులు, బ్రాహ్మణులు కర్మల సిద్ధాంతములతోను, సన్న్యాసాశ్రమముతోను గాలయాపన చేయుచున్నను ప్రజల జ్ఞానాంధకారమగ్నులై దుఃఖము ననుభవించు చుండిరి. వైరాగ్యము, నిర్లిప్తత్వము, నిర్లక్ష్యము, నిస్పృహ, నిస్సహాయత్వము పరిపాటియై, భారతీయ చైతన్యము నిర్వీర్యమైనది".

అని దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాధుని నాగేశ్వరరావుగారు అర్ధశతాబ్దం కిందట చెప్పినమాటలో ప్రత్యక్షరం ఈనాటి స్థితిగతులకు వర్తిస్తుంది. (ఆంధ్ర గ్రంథమాల బసవ పురాణ పీఠిక 1926).

భారతజాతి తాత్త్వికధోరణులపైనగాని, భిన్నమతాల మహాపురుషులు ప్రతిపాదించిన వాదాలపై కాని అఖండ భారతావని చారిత్రక, సాంస్కృతిక సమ్మేళనంపై కాని ఇప్పటివారికి సదవగాహన కాని, మౌలికమైన భావన కాని ఏర్పడలేదని, ఆ ఏర్పాటుకి అనువైనపరిస్థితులుకూడా కనపడటం లేదని విచారం వేస్తుంది సర్వమానవ కల్యాణం ఇంకా ఎంత దూరం ఉందో !

దీని కర్త - గణపనారాధ్యులు. 'పరశివయోగీంద్ర పాదారవింద, పరిమలస్యందన భ్రమరపుణ్యుడు. అనగా శైవుడు. మనోబోధ మనసును సంబోధిస్తూ శివభక్తిని తెల్పెడికృతి. ఆకృతి మంజరీద్విపద.

ఇందులో 416 పాదాలున్నాయి. మంజరి ప్రాసలేని ద్విపద. ఇట్టికృతులు తెలుగున అనేకమంది వ్రాశారు. తాళ్లపాక అన్నమాచార్యుల వారి శృంగారమంజరి ప్రశస్తమైన లఘుకృతి.

మంజరి - ఇదికూడా శతక, దండక, ద్విపద, ఉదాహరణ శాఖల్లాగే పరిశోధనను మంచి సబ్జెక్టు.

కొలనిగణపతి దేవుడనే కవి శివయోగసారం అనే యోగశాస్త్రగ్రంథాన్ని వ్రాశాడు. అందులో-

పశుపాశపతి జ్ఞానము
ను శరీరభవవిజయ మనోబోధము నా
విశదములగు నీ కృతు లస
దృశగతి చెప్పితిని దేశితెనుగున దెలియన్.

అని తన కృత్యంతరాలను పేర్కొన్నాడు.

గణపతి దేవ విభుని. . . . .
అహితగణపల్లు! రాయచౌహత్తమల్లు
అభినవాకారుధీరు! అన్యాంగనాస
హోదరు నన్ను రావింప నుచితవృత్తి''
అని బిరుదులను సూచించాడు.

ఈ కొలని గణపతిదేవుడు, మనోబోధ రచించిన గణపనారాధ్యులు ఒకరే అని చెప్పటానికి నిదర్శనం శివయోగసారకర్త తాను మనోబోధ రచించానని చెప్పటమే కాకుండా 'ఉర్విపై కాంతా సహోదరుండనగ' అనే బిరుదు శివయోగసారంలో 'అన్యాంగనా సహోదరు' అనే బిరుదుతో సంవదించడమే. అందువల్ల శివయోగసారకర్త, మనోబోధకర్త ఒకరే.

గణపనారాధ్యులు క్రీ.శ. 1400 శతాబ్దివాడని కవిచరిత్రకారుల అంచనా.

మనోబోధ చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథాలయం బులెటిన్‌లో 1950 లో అచ్చయింది. దానిని నేనూ నా మిత్రులు టి.ఎల్.నరసింహారావు కలిసి పరిష్కరించాము.

1956 ఆంధ్ర కవి సప్త శతిలో 54, 55 పుటల్లో గణపతి దేవుడు కొలని, గణపతి దేవుడు అనియాది, గణపనారాధ్యుడు - అని ముగ్గురు కవులుగా విభజించి సర్వశాస్త్రం గురించిచెప్పేరే కాని ముద్రితమైన మనోబోధ గురించి ఒక మాటలేదు. మద్రాసులో ఉన్న గ్రంధకర్తకి ముద్రితమైన సంగతి తెలియకపోవటం విడ్డూరం.

1960 ఆంధ్ర కవితరంగిణి ద్వి.ము.లో కొలని గణపతి దేవుని చరిత్ర ఉంది. కాని మనోబోధ ప్రసక్తి లేదు.

1965లో ఆరుద్రగారి సమగ్రాంధ్రసాహిత్యం 5వ సంపుటం వెలువడింది. అందులో 140వ పేజీలో "ఈ మనోబోధను నిడుదవోలు సుందరేశ్వరరావుగారు పరిష్కరించి ప్రకటించారు. పుట అడుగున పుట్ నోట్‌లో 1 మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయం వారి బులెటిన్ 1950 పుటలు 61-77. 139వ పుటలో ఆరుద్రగారు నేను ఎరువిచ్చిన స్వరశాస్త్రమంజరిని కూడా పేర్కొన్నారు.

1967 డా. జి.నాగయ్యగారి ద్విపదవాఙ్మయంలో మనోబోధ అముద్రితం అన్నారు (పుట 311). కాని శి.యో.సాకర్త, మనోబోధకర్త కొలని గణపతిదేవుడే అన్నారు.

1979 'ఆంధ్ర ద్విపద సాహిత్యచరిత్ర'లో డా. టి.సుశీలగారు (పుట 289) 'మనోబోధ 4' అని శీర్షిక పెట్టి అముద్రితం అన్నారు. పుట అడుగున ప్రాచ్యలిఖిత పుస్తక బాండాగారం బులెటిన్ సం. 3 1950 లో అచ్చయినట్లు తెలిపారు. పరిష్కర్తల పేరు లేదు.

1987 తెలుగు యోగులు- శ్రీ మేడపాటి వెంకటరెడ్డి. తొలి తెలుగు హఠయోగ కర్త కొలిని యాది గణపతిదేవుడు (క్రీ.శ. 1330-1400) అనే శీర్షికతో రాస్తూ హటాత్తుగా 19వ పుట నుండి మనోబోధ నుంచి మంజరీ ద్విపదలను ఉటంకిస్తూ వచ్చారు. శివ.యో.సా. మనోబోధల ముద్రణ వివరణలు ఇవ్వనేలేదు. 18వ పుటలో పండితులకు శివ.యో.సా.వ్రాస్తే పామరులకు మనోబోధ దేశిపద్ధతిలో వ్రాసినాడనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. 1950 మద్రాసు ఓ.ఎం.ఎల్ బులెటిన్‌లో అచ్చయిన మనోబోధకు ఇంగ్లీషుపీఠిక ఉంది. 'He adopted Kavya style in

Sivayogasaram for scholars and Desi style in Manobodha for the people at large" అని ఉంది. పై తెలుగు అభిప్రాయం దీనికి అనువాదం కాక మరేమిటి?

1988. వారే 'స్వరశాస్త్ర మంజరి' ప్రకటిస్తూ20-30 పుటల మధ్య మనోబోధనుండి పుష్కలంగా కొటేషన్లు ఎత్తి రాశారు. మనోబోధ ముద్రితమో అముద్రితమో చెప్పలేదు.

మంజరీద్విపద :

శ్రీ పార్వతీనాథు ! శ్రీనాథనాథు !
నలినసంభవనాథు ! నలినాప్తనాథు !
ముక్తికాంతానాథు ! మునిమనోనాథు !
సురుచిరగణనాథు ! సురనాథనాథు !
నాపాలిదైవంబు ! నాగురుస్వామి !
భక్తసాగరచంద్రు ! పరమయోగీంద్రు !
నణిమాదిగుణశీలు ! నానందలోలు !
వినుతకళాదక్షు ! విజ్ఞానచక్షు !
పరమభక్తాపేక్షు ! ఫాలానలాక్షు !
కైలాసనిజవాసు కరుణావిలాసు !

కపటనాటకధారు ! కాలసంహారు !
నిఖిలలోకాధారు ! నిరుపమాకారు !
ఆపోజ్యోతియౌ నాపరంజ్యోతి (?)
మనస ! తలంపుమీ ! మాయలం బడక
మాయచే జగములు మాయ మౌచుండు
మాయచే చిత్తంబు మలినమై యుండు
మాయచే పాపంబు మధురమై యుండు
మాయచే గురుభక్తి మాయుచు నుండు
మాయ బాసినగాని మనమారహరుని
సద్భక్తగణముల సంగతి లేదు.

గురుపాదములు చేరి కొలువవు నీవు
గురుపాదములు చేరి కొలిచినఁగాని
అవ్యయుఁ జింతింప నర్హంబుఁగాదు
అవ్యయుఁ జింతించు నంతటఁగాని
పాపంబు లన్నియు భస్మమైపోవు
పాపంబు లన్నియు భస్మంబులైన
సద్భక్తి యంతట సహజమై పొదలు
సద్భక్తి పొదలిన సర్వేశ్వరుండు
సాయుజ్యపదమున సత్తుగా నిలుపు
నటుగాన మాయల నన్నింటఁ గడచి

భక్తిమార్గంబునఁ బాయక నిలిచి
నిక్కమై నిలువుమీ ! నిన్ను నీ వెఱిఁగి
తన్నుఁ దానెఱింగిన దత్త్వప్రకాశు
నఖిలకర్మంబులు నంటఁగా వెఱచు
తన్నుఁ దానెఱిఁగెడు తత్త్వ మెట్లనిన
గురులు చెప్పగ నేర్పు గురుదేవు గనుము
మదినమ్మిఁ గల్పించి మట్టిరూపంబు
గురువు రూపుఁగ నమ్మి కొలచిన యెఱుక
విద్యాబలంబున విజయుతో మిగిలె
గురుదేవు నమ్మిన కూరిమింజేసి

కరికాళచోళుండు కనకంబువాన
తనపురి గురియించె ధరయెల్ల నెఱుఁగ
మఱియు సద్భక్తులు మదనసంహరుని
గూడగఁ బడిసిరి గురుభక్తిగాదె

సద్గురువాక్యంబు సత్తుగా నమ్మ
భక్తుని వినుతింప బ్రహ్మకుఁ దరమె ?
గురుదేవు నమ్మ నంచితమహామహిమ
యితరమానవుల కెట్లెఱుఁగంగ వచ్చు ?
అయినను నానేర్చి నంతఁ జెప్పెదను
ముక్తికి యగారంబు ముదముజీవంబు,

సత్యంబు చేత ప్రశాంతంబు
ధర్మంబు నిలుకడ దయ జన్మదేశ
మభవుని రప్పించు నాకర్షవిద్య
షడ్దర్శనంబుల సంకేతభూమి
మాయ లన్నింటను మాయించు ఘుటిక
జమునకు వెఱగొందు సద్బోధపథము
చిరకీర్తికిని త్రోవ శివభక్తి సుమ్మ
గుణముల శిఖరంబు గురుభక్తి మొదలు
గురుదేవుకృపనుచే కూడఁగా వచ్చు
గాని శివు గూడంగఁ గా దన్యమునను

తత్త్వంబులందు నతత్త్వంబులందు
మంత్రంబులందు నమంత్రంబులందు
లోకంబులందు నలోకంబులందు
భావంబులందు నభావంబులందు
జీవంబులందు నజీవంబులందు
వేదంబులందు నవేదంబులందు
కలఁడు లేఁ డనకుండ కలిగిన గాని
కూడంగ వచ్చునే గురుభక్తి లేక
తామున్నుఁ జేసిన తపమునఁ జేసి
తన్నుఁ దా నెఱుఁ గించు దైవంబు గురువు.

అటుగాన గురుభక్తి యాలించు మనస !
కుటిలంబులకుఁ బాసి గురుభక్తిఁ జేసి
మదనాంతకునిఁ గొల్చి మాయలఁ గెలిచి
పుణ్యపాపంబులఁ బొరయక నిలచి
రాకపోకలచేత రాయిడిఁ బాసి
సుఖ మొంద నొల్లక సొలసెదుగాక
విభవంబు దలపోసి వీఱిఁడివైతి
తలపోయ విభవంబు దక్కలే దింక
నిక్కమై కలిగిన నీవేల విడుతు !
ఇటు విను చెప్పె దభీష్టంబుగాను

యమదూత లేతెంచి యడియంగ మోది
ఈడుచు కొని పోవ యెవ్వరు దిక్కు ?
ధరణీశు సేనలు దండనాయకులు
మంత్రులు లెంకలు మదగజంబులును
తల్లిదండ్రులు నన్నదమ్ములు సుతులు
అడ్డపడఁ గలరె ? హరుఁడు దక్కంగ
మీఁదేల తలఁపవు ? మిథ్య లన్నియును
కలిమిలో మఱపునఁ గానవు శివుని
లేమిలో వగపుచే లే దీశుఁ గొలువు
కలిమిలేమియు లేనికాలంబు గలదె ?

పరము లోకారాధ్య భవరోగవైద్యు
భరితహర్షాకారు పాపవిదూరు
సకలమంత్రాతీతు సర్వజ్ఞచరితు
జ్యోతిరూపంబైన చంద్రశేఖరుని (?)
నీలోన వెలిఁగెడు నిజలింగమూర్తి

గొలువక యెవ్వరిం గొలిచెదు చెపుమ ?
శంభుని గుణములు శక్తిలో మొలచు
శాఖోపశాఖలు సకలవేదములు
శాశ్వతగుణములు సద్భక్తిపరులు
జాఁగిన లేఁగొనల్ సకలశాస్త్రములు

యుగ్రాక్షుగణముల యుగ్రకోపాగ్నిఁ
బాసినకళలు నా ప్రళయాజ్ఞశిఖలు
సర్వజ్ఞచరితముల్ చరితాంశములును
ప్రకటించు నుడులును భవపురాణములు
సర్వాత్మ గుణముల సమ్మదోక్తులును
జనియించు బీజముల్ సకలమంత్రములు.
ఇట్టి శివుని మహిమ నెఱుఁగంగ లేక
పుష్పసాయకు మాయఁ బొందఁ గోరెదవు !
పుష్పసాయకు మాయ పాడవెల్ల వినుము
చవిఁ జూడ మధురంబు సహజంబు విషము

రోతకు సదనంబు, రోషహారంబు
కాని త్రోవలత్రోవ, కపటంపుఁ జేవ
సద్గతి వక్రంబు జముని చక్రంబు
పాతక సహకారి పరధనహారి
భవరోగనిలయంబు ప్రళయసారంబు
ఏను పాపంబుల నెఱిఁగించుజాడ
నరకపురము గూర్పు నమ్మికుంటెనయు
అభిమానముల గాల్చ నలరెడు వహ్ని
ధర్మంబు గనని దట్టంపుమాట
గంభీరగుణముల గల్చెడు పిడుగు

గురువాక్యముల కెడగొననట్టి గుదియ
అపకీర్తిఁ బొందింప నలవడ్డకీలు
మనసిజు మాయసూ ! మరియును వినుము
భావ విభావాను భావోపచర్య
భావంబు లనియెడు పరువంపుటురుల
మదనుండు దనుమించు మనను యేమఱదు
నీట చేయగఁబోదు నిఖిలపాపములు
భావంబులోపల భావించు శివుని
శివలింగము దలంచి శివుఁ డవు గమ్మి
మనసున యామఱక మాయలఁ బోక

సర్వమ్ము శివుఁ డను సత్యమ్ము నమ్మి
సర్వంబు నీవైన సర్వేశ్వరుండు
నీవ నేయఁగఁబొడము నిఖిలపాపములు
నీవ సేయఁగఁబొడము నిఖిలపుణ్యములు
నిన్ను నీవెఱిఁగిన నిను వోపలేవు
మనస ! నీ కుదయించు మన్మథుచేత
గెలుపు లేకుండిన గెలిచెద జముని
తనయుల వీక్షించి తగవు నిందించి
తగిలిన తగులు మీ తగుఁ బుత్రులైన
కొఱగాని కొడుకులఁ గూరిమి సలిపి
కువిచారి దుర్గతి గూలెదు చెపుమ
మాయలన్నియు గెల్చి మదనారి గొలిచి
మచ్చరంబుల ఁద్రుంచి మలినం బణంచి
కోర్కెతీఁగెలఁద్రెంచి కుటిలం బణంచి
బహుముఖంబులు మాని భక్తి లోనూని
కామంబు వెడబాసి కరుణకుం డాసి

మెరమెరలకుఁ బాసి మేనిలో రోసి
విజ్ఞానమునఁ జొక్కి వికలతం ద్రొక్కి
యుండుట యెప్పుడే! యుండవుఁ గాక
సద్గురువాక్యంబు సత్తుగా నమ్మి

మత్తిల్లి యున్నట్టి మాయను బాసి
భక్తిగుణంబులు బలులుగాఁ బట్టి
భక్తిచే మనసునం బాయక శివుని
హృదయపద్మంబున నీశ్వరు నిలిపి
విజ్ఞానదీపంబు వెలయ ముట్టించి
శాంతామృతంబున జలకంబు దీర్చి
అష్టపుష్పంబుల నమరఁ బూజించి
కడునిర్మలపు వాయుకర్పూరములను
నారతుల్ ధూపంబు లందంద నిచ్చి
భావంబు వదలక పరమాత్మ గొలువు

భావంబు వదలని భక్తి గల్గినను
పూజ లేమైనను భూతేశు మెచ్చు
పూజఁ జప్పునఁ ద్రోచి పుక్కిటనీట
మజ్జనం బొనరించి మాంసఖండంబు
తామున్నుఁ జవి చూచి తన కిచ్చుయైన
పట్టించి పూజించి పరలేని భక్తి
కన్నప్పదేముండు కఱకంఠుఁ గూడె
పూజలే మేనియుఁ బూజింపు గాక
భక్తి లేకున్న నా ఫలమేమి ఫలము ?
పూజ లేమేనియు బూజింప కున్న

భక్తి గల్గినఁ జాలు పరమాత్మునకును
పూజలం గీజలం బోర్లఁ డెన్నడును (?)
అటుగాన శివభక్తి నలరించు మనస !
చచ్చేటివారిని చానున్నవారి
బాధలం బడువారి బడికూలువారి
నరుకులం బడువారి నాటినాటికినిఁ
జూచి స్రుక్కవు నీవు చోద్య మయ్యెడిని
నిజగృహంబుగాలి నీరై పోవ
మాయాగృహంబుతోడి మక్కువలేల?
నలువగట్టిన యిల్లు నశియించి పోవ

నీకట్టి నింటిలో నీకుండ గలదె ?
పరమార్థసంపద పరికింప వేల ?
అస్థిరసంపద లరయు నేమిటికి ?
ముక్తికామిని యుండ మూర్ఖవై కోరి
మాయంపుతరుణుల మఱుగ నేమిటికి ?
పరమాంబరము గలుగు భ్రమఁ జెంది నీవు
చీనాంబరంబుల చెలువేల కోర ?
గుణభూషణములుగల్గ కుమతివై నీవు
మాయంపుతొడవులు మఱి యేల కోర ?
విజ్ఞానమును పట్టి వెలయుచు నుండ

కొఱగాని కొడుకుల కోర నేమిటికి ?
శాంతగుణం బను సఖుఁ డుండగాను
మాయసఖుల నేల మఱగెదు మనస !
భక్తజనంబులను బంధువుల్ గల్గ
మాయబంధుల నేల మఱగెదు మనస !

చుట్టాలు పక్కాలు సుతులు సోదరులు
కలిమి లోపలి వారు కలిమి గుందినను
సిరి వోయెనని తన్ను జేరంగ నీరు
తొంటి పెంపున మానఁ దూల పోనాడి
ఏమేడ? మీరేడ? యేమి పోరామి?

అని పెక్కుభంగు లందంద బలుక
వగల సందడి నోర్చి వాసికి బాసి
మాటలు దలపోసి మది నీవు గుందు
చుండుట కోవుదే ? ఉండవు మనస !
ఎవ్వరెవ్వరి వారు లేమి పోరామి ?
చావు మాన్పగలేరు చాఁ దోడరారు
తనఁ జేయు పుణ్యంబు తన తోడునీడ
తనఁ జేయు ధర్మంబు తనకు నందఱును
ఏనింద్రియములు యెలయించి నిన్ను
నిజమందిరంబున నిలువంగ నీక

మాయతీపులు చూపి మాటిమాటికిని
అజ్ఞానమున ముంచి యముబారిఁ ద్రోచు
ఏనింద్రియంబుల నేల పొందెదవు ?
ఏ నింటిలోఁబాసి యెవ్వఁడే నిలుచు
వాతండ హరుఁ డగు నఖలలోకముల
అటుగాన యేనింట నణఁపుమీ మనస !
విషయవశంబున వికలమై తపము
నీలగఱునకుఁవాసి నిష్ఫలం బగుమ
విషయంబు విడిచిన విడుచు పాపంబు
పాపంబు విడిచినఁ బరమేశు గాంతు.

పరమేశుఁగాంచిన భవములు లేవు
విషయంబు విడువుమీ వికలమై చెడఁగ
పరసతిభావంబు పరికింపు టుడిగి
పరశివధ్యానానుభావంబు నొందు
విరసంపుమాటలు వినుట చాలించి
శివపురాణంబులు చెవులార వినుము
పెరసౌరభంబుల ప్రేమంబు లుడిచి
విజ్ఞానసౌరభ విభవంబునొందు
పొలఁతుల మొదలుగాఁ బొందుట మాని
పొలుపార శివభక్తి పొందు మెంతయును

కొఱగాని రుచిగోరు కూటంబు మాని
సద్భక్తిపరుల ప్రసాదంబు గొనుము
కాయంబు నిజ మని కానకపోయి
నపకారముల కేల కరిగెదు మనస !
దేహంబు తెఱఁగెల్ల తెలియఁ జెప్పెదను
మోహంబు యెడబాసి ముదమార వినుము
హేయంబులకు దిట్ట యెమ్ములపుట్ట
మజ్జంబునిలయంబు మలయుసదనంబు
శోణితంబులగుంట శుక్లంబుపెంట
చీముకరాటంబు శ్లేష్మభాండంబు

ముదిమి యుండెడు యిక్క మూత్రంపుబొక్క
అదియైన నిలచునే యచలంబుగాక
నీరుబుగ్గయుఁ బోలి నీరవం బగును
తరఁగల చాడ్పునఁ దరళమై యుండు
చపలుభాషయు బోలి సత్తు గాకుండు

జూదజీసిరిభాతి జూలకన్నై యుండు
బహూరూపి విధమున బహూరూపి యగును
ఇట్టిరూపము నమ్మి యేలత్రుళ్లెదవు ?
పరనింద సేయకు పరనింద వినకు
పరుల నొప్పింపకు పరధనముఁ గొనకు

కలలోనైననుఁ గామింపకుండు
కాయంబు క్రోధంబు కాంక్షయు మదము
మొదలుగా నన్నియు మునుకొని విడువు
యెవ్వరెవ్వరి యొప్పు లెంతెంత లెస్స
లంతంత దీపించు నద్దంబులోన
తా నెంత గుణియైన తనమహాగుణము
నెదిరి యంతట దోఁచు నెఱుఁగవే మనస !
కోకిలనాదంబు కోరి మెచ్చెదరు
కాకికూతలకేల కైకొని వినరు
కోరిన యర్థంబు కోకిల లొసంగు

కాకులీ నున్నను గైకొని వినరు
మేలైనవారిని మెచ్చులోకంబు
అటుగాన మేలు నీవలరింపు మనస!
స్పటిక మేవన్నియ ప్రభతోడఁ గూడ
నాచాయమై తోఁచు నట్టిదపోలె
నీవు నేమిటనైన నిరతిమైఁ బొందు
అది యెట్టి దట్టిదయై తోఁచుఁ గాన
దుర్విచక్షత బొంది దుర్గతిం బడక
పరమాత్మతో పొంది ప్రకటమై నిలువు
అవ్యయు జింతించునట్టియోగీంద్రుఁ

డవ్యయుం డగు జూవె యనుమానమేల ?
భ్రమరంబుచే మిడుత పట్టువ డుండి
దానిమ్రోతనచేసి దన్ను దా మఱచు
భ్రమరమై యుండెడి భక్తిసూ మానస!
అటుగాన దుర్బోధ లన్నియు మఱచి
పరశివధ్యానానుభావంబు నొందు
ఐక్యమై యుండెడి యానందపధవి
శివభక్తులకుఁ గాక సృష్టిలోపలను
బ్రహ్మాదులకునైన బడయ దుర్లభము
చంద్రకరోచుల జనుదెంచు తీపు

చారుచకోరంబు చవిగొననేర్చు
గా.కొండ్రుపక్షికి గలదె యానేర్పు ?
అల్పుల కాజాడ లలవియే చెపుమ
రూప మీరూప మని రూపింపరాదు
వర్ణ మీవర్ణ మని వర్ణింపరాదు
భావ మీభావ మని భావింపరాదు
కూర్మి యీకూర్మి యని కూడంగరాదు
వేదంబులకునైన వెదకంగరాదు
నఖిలమంత్రంబుల కందంగరాదు
మఱగినవారికి మఱిపాయరాదు

పరశివధ్యానంబు భావింపఁ గడిది
కడుచిన్నపాపని కలలోని సుఖము
బయల వ్రాసినరూపు పరమతత్త్వంబు
యనుమానమునఁ జేసి యధికదూరంబు
యనుమాన ముడిగిన నందంగఁ జేర్పు

లోనికి లోనునై నెదిరికి నెదురు
కుముదాళి శశియునుఁ గూడంగ గురియు
నమృతంబుతేటలో నమరిననిగ్గు
లోపలి ననుమించు లోనిసారంబు

చనుదెంచు మించుతో చనుదెంచు రాఁగ
పల్లవంబుల  మీఁది పరువంబు పుష్ప
సౌరభ మనియెడు సహజంపుగంపు
మఱపులోపలి మఱపు మఱపుసూ మనస!
ఏ కర్మమునుఁ జేసి యెవ్వ రేనియును
భావింప కాయాయి భావన కడిది
నీలోక మేలంచును నివ్వెర పొంది
పరశివాకారంబు భావింపఁగడిది
అటుగాన శివరూప మరిది చెప్పెదను
కలఁడని చూతమా కానంగరాఁడు

లేఁడని చూతమా లేకుండఁ డెందు
అనుమానమునఁ జేసి హరుఁగానరాదు
అనుమాన ముడిగిన హరుఁగానవచ్చు
నీలోన దేవుండ నిరతమై యుండు
అతిదూరమునగాని యలరదుభక్తి
నిఖిలంబు శివుఁ డని నిలువుమీ మనస !
గాలియు శశియును గగనంబు రవియు
ననలంబు నీరును నాత్మయుం బృథివి
హరునకు దనువులై యతిశయం బొందు
అష్టతను లంట ! ఆదియెంతఁ గాని

తనువు లెల్లను దాను తలఁప నేర్చినను
ఘటములోపలి నీటఁ గమలారిఁ దోచు
విధమున దనువులు విలసిల్లుచుండు
మనస ! జీవులయందు మదనారియుండు
జాడెఱుంగక లేక చంచలంబుగను
ఆజాడ యెఱిఁగిన నంతటిలోన
నిఖిలకర్మంబులు నిన్నంటనోడు
కమలపత్రమునీట గదసి యుండియును
నీరుతో బొందునే నిర్మలయోగి
సంసారమాయల సందడి బొంది

మాయతో బొందని మహిమఁ దాఁ బొందు
మాయతీపులతోడ మరుగ కుండినను
పదము నిల్లును నొక్క వాసియె కాదె.
అడవులలోపల ననిశంబు నుండి
మాయతీపులతోడ మరగి యుండినను
అజ్ఞానిగా కతఁ డగునె సుజ్ఞాని ?
శిరమెల్లఁ గొరిగించి జీరలు విడిచి
తత్త్వజ్ఞుఁ డన నుండ దలచదో మనస !
వెండ్రుకల్ చీరలు విడిచి పోయినను
మాయలు విడుచునే మనస! భావింప.

తలబోడ చీరయు తలపులో నెపుడు
తలపని పడుచుల తత్త్వజ్ఞు లండ్రు
పద్మాసనంబున బైశికవెట్టి
వీఁపును విరుచుచు వీఁగి నిక్కుచును
వాయువుల్ పట్టుచు వదలంగఁ జేయు

చుండుట యోగమే ? యుండ గోరెదవు
శివుతోడ గూడక శివయోగి యగునె ?
మనమున విషయంబు మఱవకుండినను
యుదరవేషంబులు యొప్పునే చెపుమ ?
ఈ వేష మావేష మేది యొప్పనుచు

షడ్దర్శనంబుల జతనమై తిరిగి
ఎందునే బొందక యెడమాటలాడి
వికలమై యుండెడి వీఱిఁడి మనస !
ఏకముఖంబున నెల్లలోకములు
దన్ను బొందెడు నను తలఁపునఁ జేసి
వేరువేరై యుండు విధముసూ మనస !
అష్టతనువులైయుండు హరునిరూపంబు
అతనితో బొందిన నవియు వేఱఁగునే !
వేదంబు నందును వినవటే చెపుమ!
అటుగాన శివురూప మంతయు నెఱింగి

షడ్దర్శనంబుల జాడలు మఱచి
హరుతోడ కంకణం బలవడ గట్టి
యేదర్శనంబుల యిచ్చకు రాక
శంభుండె పతియను సహజంపు పలుకు
పలుక నొల్లక యేల బలుత్రోవ లూది
యుండుట యొప్పునే ? యుండఁ గోరెదవు
కుక్కకడుపున నెయ్యి కొలిచి పోసినను
నెయ్యేల యందునే నేరిమిగాక
కొఱగానిమనసుల గురుబోధ నీవు
లెందాక వెడలుబో యినుమడిగాను

సద్భక్తిగణముల సంగతి బొడము
ఇంపు వహించిన యింపునా తీపు
ఏనుపాపంబుల యెఱిఁగి చేసినను
హరుని భక్తుల చూచినంతనే బాయు
భక్తుల కెగ్గులు పలుకనివారి
పదిలమై పట్టిన పరగు సద్భక్తి
హరుని సద్భక్తుల హరుఁ డని తలంప
నిఖిలకర్మంబులు నందుబో మనస !
శివయోగి నొకమాటు చింతింప తడవ
శివభక్తి బొందిన శివయోగివరుల

నేయే కుల మ్మని యెఱుక గైకొనకు
పరుస మొందిన యిన్ము పసిడియై యుండు.
నినుమాని తలచుట నేరమిగాదె
పరమాత్మలో బొంది భక్తుఁడై యున్న
నకులజుం డనియెడు ననుమానమేల ?
వివిధకార్యంబులు వేఱువేఱైన
గుణములు కల్పించి కోరిచెప్పెదరు
ఆవులు పలుచాయలై యుండుగాక
పాలు నాచాయలై బరగునే చెపుమ ?
జాతులు పెక్కని చాటిన నేమి ?

జీవుఁ డొక్కఁడె కాదె చిక్కు లింకేల ?
నారికేళపుకాయ నగచరు నొద్ద
నైచిన నేవింప వల నేమి యెఱుఁగు ?
సకలవేదంబులు సకలశాస్త్రములు
చదవని నజ్ఞాని సారమే మెఱుగు ?

ఆలరుల తావికి నలరునే మిడత ?
మృదుశంఖనాదంబు మెచ్చునే చెవుడు ?
కొమరారు నృత్యంబు గోరునే కాకి ?
కస్తూరి వెదకునే గ్రామసూకరము ?
వెలయ సౌభాగ్యంబు వెదకునే గూబ ?

తనరార చతురత దనరునే యెద్దు ?
పాపాత్మునకు నేల భక్తునిక్రియలు ?
సంసారమాయల చనలంపుతీపు
మఱిగిన నింకేల మామాటలయింపు
నింపిన నింపునే నిచ్చగించినను
వీనికెల్లను ఫలము విశ్వేశు గొలిచి
సంసారమాయల చవు లెల్ల విడిచి
సద్గురువాక్యంబు నత్తుగా నమ్మి
శివభక్తివంతుల శివునిగాఁజూడు
శివుఁ డిట్టివాఁడని చింతింపరాదు

బయలవ్రాసినరూపు బయలగుదీపు
మరుపులోపలిరూపు మక్కువపాలపు
కలఁగి కలంగని కరుణంపు బెంపు
మఱచి మఱువంగరాని మఱువంపుటింపు
తలచితలపగరాని తత్త్వసారంబు
స్వరములేని నొడవు సద్గతినొడవు
చాయదాటని నీడ చవలేనిజాడ
షడ్దర్శనంబుల సాయుజ్యమూర్తి
సురుచిరగుణవర్తి సురచక్రవర్తి
విబుధులమది కన్ను వేదంబు చన్ను

బ్రహ్మాండముదిట్ట ప్రళయాజ్ఞనిట్ట
విదితవిహారంబు విజయహారంబు
కుహనాకరాటంబు గుణమండనంబు
భావాదిరహితుండు ప్రళయకాలుండు
కామాంగదహనుండు కాలాంతకుండు
అభిరామభరితుండు అప్రమేయుండు
త్రిగుణవిదూరుండు త్రిపురాంతకుండు
బ్రహ్మాదివంద్యుండు భక్తవత్సలుఁడు
కరుణావిలాసుండు కపటనాటకుఁడు
ప్రకటగుణాఢ్యుండు పంచాననుండు

నిర్మలాకారుండు నిత్యోదయుండు
వర్ణాదిరహితుండు వాసవార్చితుఁడు
ఫాలానలాక్షుండు ఫణికుండలుండు
ఇభచర్మవాసుండు ఇందుశేఖరుఁడు
పంచాంబరేశుండు పంచవక్త్రుండు
భస్మాంగరాగుండు పరమేశ్వరుండు
కర్మవినాశుండు గౌరీశ్వరుండు
వటమూలసదనుండు వామదేవుండు
ఇట్టి మహాదేవు నెఱుఁగవే మనస !
శివభక్తిమంతుల శివుఁడని నమ్మ !

భక్తుల పూజింపు భక్తుల గొలువు
భక్తు లందు శివుఁడు ప్రమథులుం దాను
బాయ కెప్పుడు నుండు పరమార్థ మిదియె.
నాబోధ విని భక్తి నైష్ఠికంబునను
భక్తానుభవమున బ్రదుకవే మనస !

అని మది బోధించె ననురాగ మలర
పరశివయోగీంద్ర పాదారవింద
పరిమళస్యందన భ్రమరపుణ్యుండు
..................యనెఱఁగని యీమానసమున
మంటల నడుమ నమ్మహిమాస్పదుండు

విజ్ఞానగుణముల వెలయ బోధించి
ఉర్విపై గాంతాసహోదరుం డనఁగ
గణపనారాధ్యులఁ గరుణించు శివుఁడు
మదమె............ నమపామాన్వయుండు
ఆచంద్రతారార్కమై యొప్పు భక్తి
వెలయ మనోబోధ వేడ్కమై చెప్పె
ఈబోధఁ జదివిన నెలమిమై విన్న
పఠియింప వ్రాసిన భక్తియు యుక్తి
భుక్తియు ముక్తియు భూతేశుఁ డొసఁగు.